




మా టీచర్ నా ప్రోగ్రెస్
రిపోర్ట్‌లో 'వెరీ గుడ్'
అని రాసిందంటే, అమ్మ
నాకు 'వెరీ వెరీ గుడ్'
అయినది ఒకటిస్తుంది.
అదేమిటో తెలుసా?
నా ప్రియమైన రస్నా!



I love you Rasna

మొట్టమొదటి
IS:13019



అంగీకారం పొందిన సాఫ్ట్ డ్రింక్ కాన్సన్‌ట్రేట్. దీనిలో బి.వి.ఓ. లేదు.

ఆరెంజ్ ■ పైనాపిల్ ■ లైమ్ ■ షాహీ గులాబ్ ■ కాలా ఖట్టా ■ కూల్ ఖస్ కేసర్ ఇలైచి ■ మసాలా సోడా (జల్ జీరా) ■ టూటీ ఫ్రూటీ ■ మేంగో రైప్

* నిర్దేశించబడిన నగరాల్లోనే లభిస్తుంది.

Mudra:A:EAMR:5483 Tel

# ఉచితం

ప్రతీ రీటా పౌచ్‌తో







ఒక ఐటెక్స్ కాటుక

రీటా మీ కేశ సంపదకు

నేడే ఒక పౌచ్ కొనండి ప్రతీచోటా దొరకును

SDR VC 3, 91

దేశ అభివృద్ధికి చెట్లని పెంచండి






# సర్కస్ మోసగాడి

భలే తమాషా. ఒకటా రెండా ఎన్నో వున్నాయి. అంతుచిక్కని రహస్యాలు. అవేమిటో తెలుసుకోడానికి కలసి ముందుకు కదులుదాము.

చౌదరిగారి అమ్మాయి కనిపించడం లేదు. మరెవరి పని. సర్కస్ మోసగాడి పనే. సర్కస్‌లో అటువంటి పని ఎవరు చేస్తారు కనుక. బియస్ఏ యస్‌యల్ఆర్ బాల గూఢచారులు పరిశోధన మొదలు పెట్టారు. ప్రమాదాలని లెక్కచేయకుండా ముందుకు కదిలారు మోసగాడిని పట్టుకోడానికి.



స్కూల్ నుంచి ఇంటికి బయలు దేరిన ప్రియంకా మాయమయిపోయింది. ఎలాగో తెలుసా. స్కూల్ విడిచిపెట్టిన వెంటనే రోడ్డు మీదకి వచ్చిన ప్రియంకా ప్రక్కనే ఒక ఎర్ర కారు ఆగింది. ప్రియంకాని ఒక్కసారి కారులోకి లాగేశారు. ఆ తర్వాత ఏమయిందో ప్రియంకాకి తెలియలేదు. చీకటి గుహలో వున్నానా అనిపించింది. జంతువులు గుర్రు గుర్రు మంటూ వుంటే ఎంతో భయం వేసింది. "సింహాలలా వుండే. వాటికి ఆకలివేస్తే బాబోయ్" ప్రియంకాకి చెమటలు పట్టాయి. ఆ రాత్రి 8 గంటలకి చౌదరీగారికి ఫోన్ వచ్చింది. "చౌదరి గారూ ప్రియంకాని చూడాలని వుందా. ఆదివారం ఉదయం 11-45కి సర్కస్‌కి రండి. తెల్లని సూట్ వేసుకుని రావాలి. ఉత్త చేతులతో కాదు. రెండున్నర లక్షల రూపాయలు తీసుకురావాలి" విలన్ భయంకరంగా నవ్వుతూ చెప్పాడు.

## వచ్చేశారు బియస్ఏ యస్‌యల్ఆర్ బాల గూఢచారులు

శుక్రవారం. ఇంకా రెండురోజులు కూడా లేదు. విపుల్‌కి భలే ఐడియా వచ్చింది.

"ఒక్కసారి అక్కడకి వెళ్ళి చూస్తే" "సరే



బియస్ఏ యస్‌యల్ఆర్ ల మీద వెళ్దాము!" అన్నాడు రాల్ఫ్. నిమిషాలలో సైకిళ్లు తీశారు. వేగంగా ముందుకు కదిలారు. చక చకా బాలగూఢచారులు దూసుకు పోయారు. అడుగు జాడలు కనిపించినట్లున్నాయి. ఆగారు.

"కదలకండి. గోడచాటున దాక్కుందాము" పూజ హెచ్చరించింది. ముగ్గురూ చెవులు గోడలకు ఆనించి వినడం మొదలు పెట్టారు. "వచ్చే ఆదివారం 2,50,000 మన చేతికి వచ్చేస్తాయి. లేకపోతే" ఎవరో అంటున్నారు. ఆ తర్వాత గట్టిగా నవ్వారు. కొంతసేపు తర్వాత బాల గూఢచారులు గోడచాటు నుంచి బయటకు వచ్చేశారు. అప్పుడు వాళ్ళకి కనిపించింది ఒక జేబురుమాలు. దాని మీద వుంది 'జె' గుర్తు. "భలే భలే ఇదే ఆధారం ముందుకు వెళ్దాము" అంటూ బియస్ఏ యస్‌యల్ఆర్ ల మీద ముందుకు సాగారు.

**శనివారం.** "జె" అబ్బా ఇది ఎవరి జేబురుమాలు అయివుంటుంది. ప్రియంకా ఎక్కడ వుందో దీనితో మనం కనిపెట్టగలమా"

# అంతు చిక్కని రహస్యం

విపుల్‌కి అనుమానం వచ్చింది.

**ఆదివారం.** చౌదరిగారు ఎంతో భయపడ్డారు. విలన్ చెప్పింది చేయక తప్పలేదు. తెల్లసూట్ వేసుకున్నారు. 2,50,000 రూపాయలు తీసుకున్నారు. అన్నీ నూరు రూపాయల కట్టలే. సర్కస్ దగ్గరకు వచ్చారు. సర్కస్ ఆట మొదలుపెట్టారు. కొందరు గాలిలో ఫీట్స్ చేస్తున్నారు. జోకర్ తమాషాలు చేసి నవ్విస్తున్నాడు. ఇంతలో ఫీట్స్ చేస్తున్న ఒకరి జేబురుమాలు పైనుంచి పడిపోయింది. దాని మీద 'జె' గుర్తు! ఇంకేమి కావాలి? శుక్రవారం కనిపించిన గుర్తే!

బాల గూఢచారులు ఆనందం ఆపుకోలేకపోయారు.

"చౌదరీ అంకుల్ మేము కనిపెట్టాము. మీరూ కనిపెట్టారా ఆలస్యం చేయవద్దు. పోలీసులను పిలవండి బియస్ఏ యస్‌యల్ఆర్ మీద వేగంగా వెళ్ళండి. ఇనిస్పెక్టర్ అంకుల్‌ని మీతో తీసుకురండి.

ఆ తర్వాత మోసగాడిని, అతని ముఠాని పట్టుకున్నారు. ప్రియంకాని విడిపించారు. "బియస్ఏ యస్‌యల్ఆర్‌ల మీద శుక్రవారం రాత్రి ప్రారంభించాము ప్రయాణం. అప్పుడే గదా దొంగని పట్టడానికి దొరికింది ఆధారం" అని పాడుకున్నారు.

**ఇంతకీ ఇతను ఎవరు అబ్బా?**

త్వరలో మతిస్థిమితం లేని వాస్‌ఎచ్ అంతుచిక్కని రహస్యం మీరు చదువుతారు. అప్పుడు ఈ సర్కస్ మోసగాడు ఎవరో మీరు తెలుసుకుంటారు. అంతవరకూ మీ బియస్ఏ యస్‌యల్ఆర్ ల మీద ఆనందంగా సాగండి. టా టా..





**BSA SLR**

*Get Set 'n' Go on an adventure*

# చందమామ

స్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## నిరక్షరాస్యతా నిర్మూలన!

అక్షరాస్యతా సంవత్సరంగా, గడచిన సంవత్సరం మనదేశ చరిత్రలో చిరకాలం గుర్తుంటుంది. కేవలం ఒకసంవత్సర కాలాన్ని అక్షరాస్యతా సంవత్సరంగా ప్రకటించినంత మాత్రాన ప్రజలందరినీ అక్షరాస్యుల్ని చేయడం అన్నది అసాధ్యమైన కార్యమే. అయినప్పటికీ, ప్రగతికి తొలిమెట్టయిన అక్షరాస్యత పట్ల అందరి దృష్టినీ ఆకర్షించడానికి ఈ సంవత్సరం ఎంతో దోహదం చేసింది.

అక్షరాస్యతాసంవత్సరం ఇచ్చిన స్ఫూర్తితో, కొన్ని జిల్లాలనూ, పట్టణాలనూ ఎంపికచేసి, అక్కడి ప్రజలలో అక్షరాస్యతను పెంచాలన్న పథకాలు రూపొందించారు. ఆ విధంగా కేరళ రాష్ట్రంలోని ఎర్నాకుళం జిల్లాలోనూ, కోట్టయం నగరంలోనూ వందశాతం అక్షరాస్యతను సాధించారు! 1991 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో అక్షరాస్యుల సంఖ్య దాదాపు 52 శాతం. పురుషులలో అక్షరాస్యులు అరవైనాలుగు శాతం అయితే స్త్రీలలో నలభైశాతం మాత్రమే ఉన్నారు. కాని, ఏప్రిల్ నెలలో వెలువడిన సమాచారం ప్రకారం, కేరళరాష్ట్రం వందశాతం అక్షరాస్యతను సాధించింది!

గత సంవత్సరంలాగే ఈ సంవత్సరం కూడా నిరక్షరాస్యతా నిర్మూలన ఉద్యమాన్ని మరింత తీవ్రంగా కొనసాగించి, ఈ దశాబ్దాంతానికి దేశంలో అందరూ అక్షరాస్యులు అన్న మంచి స్థితిని అందుకోవడానికి ప్రతిఒక్కరూ గట్టిగా కృషిచేయాలి!

సంపుటి 88 మే '91 సంచిక 5
విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00









# మేగీ క్లబ్-అడవులలో సరదా వినోదం ఉచిత బహుమతుల ఆనందం



మేగీ 'ఆపరేషన్ వైల్డ్ లైఫ్' ఆటలో వన్యమృగాలను రక్షించండి.




మేగీ 'కింగ్ ఆఫ్ ద జంగిల్స్' ఆటలో అడవులు జయించండి

బాలలూ రండి! మేగీ క్లబ్‌లో చేరి, సంవత్సరమంతా సరదా వినోదాలలో పాల్గొనండి. మిమ్మల్ని ఉర్రూత లూగించే న్యూస్ లెటర్స్ బహుమతులు, ఆటలూ ఇంకా ఎన్నెన్నో!

మీరు చేయాల్సినది ఈ [2-minute logo] ను 5 ఖాళీ మేగీ నూడుల్స్ పేక్‌ల నుండి కత్తిరించి, మీ పేరు, చిరునామా, మీకు నచ్చిన బహుమతిని పేర్కొని మాకు పంపండి. మీరు గనుక మెంబరయితే మీ నంబరును వ్రాయటం మరువకండి. మీరింకా మేగీ క్లబ్ మెంబరుకాని పక్షంలో, మెంబరుకావటానికిదే మంచి అవకాశం. మీ వివరాలతో బాటు మెంబర్‌షిప్ కావాలని వ్రాయండి. మీ బహుమతితో బాటు, మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డు ఉచితంగా పంపబడుతుంది.



మేగీ 'జాదూ జంగిల్' మీరు స్వంతంగా నిర్మించండి.




మేగీ 'బర్డ్‌హౌస్' ను నిర్మించండి.




ఆర్చీ కామిక్స్!

మా అడ్రసు:

**మేగీ క్లబ్**

పి.ఒ. బాక్స్. 5788,
న్యూ ఢిల్లీ-110 055




ఉచిత మేగీ 'వరల్డ్ ఆఫ్ యానిమల్స్' ప్రశ్నోత్తరావళి

మీరు 3 బహుమతులు సేకరించగానే, ఆసక్తికరమైన, ఉత్కంఠత కలిగించే అద్భుత యదార్థ విషయాలెన్నో తెలియజేసే ఉచిత మేగీ 'వరల్డ్ ఆఫ్ యానిమల్స్' ప్రశ్నోత్తరావళిని పంపుతాము. గేమ్‌లపైనున్న వివరాలను శ్రద్ధగా చూడండి.







మరొక ఉపహారం: ఈ సరికి మీరు 'లాస్ట్ ఆఫ్ ద జంగిల్ గేమ్'ను సేకరించి ఉండక పోతే, వెంటనే వాటిని పొందండి

HTA 7105TEL

# సమైక్యతకు మద్దతు!




ప్రెసిడెంట్ గోర్బచేవ్ అడిగిన ప్రశ్నకు, అధిక సంఖ్యాకులయిన సోవియట్ ప్రజలు 'అవును' అని నిర్ద్వంద్వంగా సమాధానం ఇచ్చారు.

ఒక సమస్య మీద ప్రజాప్రతినిధుల ద్వారా కాకుండా, ప్రజల నుంచే ప్రత్యక్షంగా అభిప్రాయం తెలుసుకోవడానికి 'రెఫరెండం' అనే ప్రజాభిప్రాయ సేకరణ జరుపుతారు. ప్రజల ముందు ఒక ప్రశ్న వుంచి, అవునా? కాదా? అని అడుగుతారు. ఓటింగ్ పద్ధతిలో ప్రజలు తమ అభిప్రాయం వ్యక్తం చేస్తారు.

ప్రెసిడెంట్ గోర్బచేవ్ ప్రజల ముందు ఉంచిన ప్రశ్న ఇది: "సోవియట్ రష్యాలో సమానస్వేచ్ఛా స్వాతంత్ర్యాలు గల రిపబ్లిక్‌లు యూనియన్‌గా కొనసాగాలని మీరు భావిస్తున్నారా?"

ఈ ప్రశ్నకు అధిక సంఖ్యాకులయిన సోవియట్ ప్రజలు 'అవును' అనే సమాధానం ఇచ్చారు. అంటే, సోవియట్ రష్యా యూనియన్‌గా కొనసాగాలని అధిక సంఖ్యాకులయిన ప్రజలు కోరుతున్నారని గోర్బచేవ్ జరిపిన మొట్టమొదటి ప్రజాభిప్రాయసేకరణలో వెల్లడయింది.

అయినా, ప్రజల్ని ఈ ప్రశ్న అడగవలసిన అవసరం సోవియట్ ప్రెసిడెంట్‌కు ఎందుకు ఏర్పడింది?

గోర్బచేవ్, 'పెరస్త్రోయికా,' 'గ్లాస్‌నోస్త్' పేర్లతో కొన్ని ఉదార సంస్కరణలు ప్రవేశపెట్టాడు. ఆ సంస్కరణలు మొదట అధికార వికేంద్రీకరణకూ, మత స్వేచ్ఛకూ, పాశ్చాత్య ప్రజాస్వామ్య పద్ధతిపట్ల మొగ్గుకూ, ఆ తరవాత మరికొన్ని అనూహ్యమైన పరిణామాలకూ దారి తీశాయి. ఆహార పదార్థాలకొరత, ద్రవ్యోల్బణం ఏర్పడడంతోపాటు, కొన్ని రిపబ్లిక్‌లలో యూనియన్ నుంచి విడిపోవాలన్న వేర్పాటువాదం బయలుదేరింది. వేర్పాటు ఉద్యమాలు ఎక్కువై వాటిని అణచడానికి కొన్నిచోట్ల బలప్రయోగానికి పూనుకోవలసి వచ్చింది. అయినా, సమస్య




పరిష్కారం కాలేదు. ఇంతజరిగాక, ఇక ప్రజాభిప్రాయసేకరణే మార్గమని గోర్బచేవ్ నిర్ణయించాడు.

రెఫరెండంలో ప్రజలు ఐక్యతనే బలపరిచారు. ఈ రెఫరెండంలో ఆరు చిన్న రిపబ్లిక్‌లు పాల్గొనలేదు. కాని దేశం మొత్తం జనాభాలో దాదాపు తొంభైశాతం ప్రజలు నివసిస్తున్న మిగతా తొమ్మిది రిపబ్లిక్‌లు పాల్గొని సమైక్య సోవియట్ యూనియన్‌కే తమ మద్దతును తెలియజేశాయి. ఈ రెఫరెండం ద్వారా వేర్పాటువాదుల ఉద్యమబలం కొంత తగ్గుతుంది. అంతే కాదు; దీని ద్వారా సోవియట్ ప్రజలు గోర్బచేవ్‌పట్ల తమ విశ్వాసాన్ని పరోక్షంగా ప్రకటించినట్లే అవుతుంది. వంద జాతులకు పైగా వుంటున్న సోవియట్ ప్రజల విజ్ఞతకూ, స్వతంత్ర ఆలోచనాధోరణికీ ఇదొక ఉదాహరణ.



# అత్తగారి కంచం

చుక్కపల్లి గ్రామంలో వడ్లవ్యాపారం చేసే పరమేశం, ఒకసారి పని మీద పట్నం వెళ్ళి, బావమరిది ప్రకాశం కొత్తగా అద్దెకు తీసుకున్న ఇల్లు వెతికి కనుక్కొనే సరికి బాగా చీకటి పడిపోయింది. ప్రకాశం ఆ మధ్యనే పెళ్ళి చేసుకుని, కాస్త సౌకర్యంగా వుండే ఇల్లు దొరగ్గానే, భార్య భాగ్యాన్ని కాపురానికి తీసుకు వచ్చాడు.

పట్నంలో పరమేశానికి నాలుగు రోజుల పని వున్నది. పనిలోపనిగా బావమరిది కొత్తకాపురాన్ని కూడా చూసి పోదామను కున్నాడతను.

ఒకటి, రెండుసార్లు తట్టాక తలుపు తెరిచిన ప్రకాశం, పరమేశాన్ని చూస్తూనే చిరునవ్వునవ్వుతూ, ''రా, బావా! ఇప్పుడే భోజనాలకు కూర్చున్నాం. కాళ్ళు కడుక్కొని వచ్చేసెయ్యి,'' అన్నాడు.

అంతలో ప్రకాశం భార్య భాగ్యం, నీళ్ళ చెంబుతో వచ్చి, ''ఇవిగో అన్నయ్యా, నీళ్ళు!'' అంటూ పరమేశానికి నీళ్ళ చెంబు అందించింది.

పరమేశం కాళ్ళు కడుక్కొని వంట గదిలోకి వచ్చి, అక్కడ మూడు కంచాలలో భోజనం వడ్డించి వుండడం చూసి, ''నేను వస్తున్నట్టు ముందుగానే ఊహించి వడ్డన కూడా చేసి వుంచారే!'' అన్నాడు, ఒక కంచం ముందు కూర్చుంటూ.

''ఆ మూడో కంచంలోది అమ్మకోసం వడ్డించిన భోజనం, బావా,'' అన్నాడు ప్రకాశం.

అది విని పరమేశం ఒక్క క్షణం నిర్ఘాంతపోయాడు. తన అత్తగారు— ప్రకాశం తల్లి ఐదేళ్ళక్రితం పోయింది. ఆవిడకోసం ఇప్పుడు కంచంలో భోజనం వడ్డించడమేమిటి?

మాచిరాజు కామేశ్వరరావు



''అయితే, ఈపూట ఇది నేను తినేస్తే, అత్తయ్య భోజనం మాటేమిటి ?'' అని అనుమానంగా అడిగాడు పరమేశం.

''నువ్వు మొహమాటపడకుండా భోజనం చెయ్యి, అన్నయ్యా. అత్తయ్యగారి కోసం మళ్ళీ వండుతాను,'' అన్నది భాగ్యం నవ్వుతూ.

బావమరుదులిద్దరూ భోజనాలు ముగించి కబుర్లు చెప్పుకోసాగారు. భాగ్యం అత్తగారి కోసం వంట ప్రారంభించింది.

మాటల మధ్యలో ప్రకాశం ఆనందంగా, ''నేను చాలా అదృష్టవంతుణ్ణి, బావా! బతికున్న అత్తలకు అన్నం పెట్టక చంపే కోడళ్ళున్న ఈ కాలంలో, కంటికి కనబడని అత్తకోసం రెండోసారి ఓపిగ్గా వంట చేస్తున్నది, భాగ్యం! అమ్మకు భాగ్యం అన్నా, భాగ్యం చేతి వంట అన్నా చాలా ఇష్టం,'' అన్నాడు.

ఆ రాత్రి భాగ్యం, పరమేశానికి ముందు గదిలో పడక ఏర్పాటు చేసింది. అతను సూర్యోదయానికి కొంచెం ముందుగా నిద్ర లేచాడు. ఇంకా ప్రకాశం దంపతులు నిద్ర పోతూనే వున్నారు. పరమేశం వంట గది లోకి వెళ్ళి, అత్తగారి కోసం వడ్డించిన కంచం మూత తీసి చూశాడు. అది ఖాళీగా వున్నది. అతడికి ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది.

పరమేశం ఆశ్చర్యపోవడం గమనించిన ప్రకాశం, ''అలా ఆశ్చర్యపడకు, బావా! అమ్మ ఈ ఇంట్లోనే వుంటున్నది. నాకు కనబడకపోయినా, భాగ్యానికి కనిపిస్తున్నది. అంతే కాదు, అప్పుడప్పుడూ భాగ్యానికి సలహాలు కూడా ఇస్తున్నది,'' అన్నాడు.

''మరి, కంచంలో వడ్డించిన భోజనం, అత్తయ్య ఎప్పుడు తింటుంది ?'' అని అడిగాడు పరమేశం.

''మేము భోజనం చేసి, అత్తయ్యగారి కంచం మీద మూతపెట్టేస్తాం. తెల్లవారే సరికి కంచం ఖాళీగా వుంటుంది,'' అన్నది భాగ్యం.

పరమేశం ఆనాటి సాయంత్రం, పని చూసుకుని ఇంటికి తిరిగి వస్తూండగా, ప్రకాశం, భాగ్యం దారిలో ఎదురయ్యారు. ప్రకాశం, అతడితో, ''బావా, ఇంటి తాళం చెవి పక్కఇంటి వాళ్ళనడిగి తీసుకో. నీ దగ్గిర ఒక నాలుగు వందలుంటే ఇవ్వు. జీతం రాగానే ఇచ్చేస్తాను,'' అన్నాడు.

పరమేశం అతడికి నాలుగు వందల రూపాయలిచ్చాడు. ఆ రాత్రి దంపతు లిద్దరూ ఇంటికి తిరిగి వచ్చారు. భాగ్యం చేతిలో ఒక కొత్త పట్టుచీర వున్నది.

ఆమె గోడవారగా వున్న కుర్చీ దగ్గిరకు వెళ్ళి, అక్కడ అత్తగారు కూర్చుని వున్నట్టుగా, ''ఇదుగో, అత్తయ్యా! మీరు చెప్పినట్టే నీలం పట్టుచీర కొన్నాడు, మీ అబ్బాయి. నచ్చిందా?'' అంటూ చీర రంగూ, అంచూ అన్నీ చూపింది.

తర్వాత ఆమె, భర్తతో, ''కట్టుకోవల సిన దానివి నువ్వు. నీకు నచ్చితేచాలు!'' అంటున్నారు అత్తయ్యగారు,' అన్నది.

ప్రకాశం తృప్తిగా తలాడించాడు. రాత్రి భోజనాల దగ్గిర భాగ్యం, అత్తగారికి వడ్డన చేసిన కంచం కేసి చూస్తూ, ''అదేమిటత్తయ్యా! ఇంటికి వచ్చిన అల్లుడిని వెళ్ళిపొమ్మనడం, ఏం మర్యాద?'' అన్నది.

''ఏమిటి, భాగ్యం! అమ్మ ఏమంటు న్నది?" అని అడిగాడు ప్రకాశం ఆత్రంగా.

''అత్తయ్యగారికి, తన కూతురు ఇంట్లో ఒంటరిగా వుండలేదని బెంగ. తల్లిప్రాణం





కదా! అన్నయ్యను రేపు వెళ్ళిపొమ్మని చెప్పమంటున్నది," అన్నది భాగ్యం.

పరమేశం నవ్వి, "అత్తయ్యకు చెప్పు. ఎల్లుండి పొద్దునే వెళ్ళిపోతాను. రేపటితో ఇక్కడ నా పని తప్పక అయిపోతుంది," అన్నాడు.

ఆ రాత్రి ఎంతసేపటికీ పరమేశానికి నిద్రపట్టలేదు. ఒక రాత్రివేళ మంచినీళ్ళ కోసం వంటగది కేసి వెళ్ళి, అక్కడి దృశ్యం చూసి నిర్ఘాంతపోయాడు.

అంతకుముందు తమతోపాటు భోజనం చేసిన భాగ్యం, అత్తగారికని వడ్డించిన కంచం ముందు కూర్చుని, ఆబగా మళ్ళీ భోజనం చేస్తున్నది!

పరమేశం చప్పున వెనుదిరిగి వచ్చేశాడు. మర్నాటి రాత్రి భోజనాల దగ్గిర కూర్చున్న పరమేశం చప్పున పీట మీది నుంచి లేచి, వాకిటికేసి చూస్తూ, "నువ్వా, మామయ్యా, రా!" అన్నాడు ఆశ్చర్యంగా.

ప్రకాశం తలతిప్పి, పరమేశం చూస్తున్న వైపు చూసి, "ఎవరొచ్చారు, బావా? ఎవరూ కనిపించడం లేదే!" అన్నాడు.

"నీకు కనిపించడం లేదా? ఆరేళ్ళ క్రితం పోయిన, మీ నాన్న వచ్చాడు," అన్నాడు పరమేశం.

ఆ తర్వాత పరమేశం, తన కంచం ముందు కూర్చుంటూ, "కూర్చో, మామయ్యా! నీ కోసం మరొక కంచంలో వడ్డన చేయిస్తాను," అన్నాడు.

భాగ్యం నమ్మలేనట్టు చూస్తూ, మరొక కంచం తెచ్చి భోజనం వడ్డించింది.

"బావున్నావా, మామయ్యా! ఏమిటిలా వచ్చావు?" అని కంచం కేసి చూస్తూ, అడిగాడు పరమేశం.

ఒకటి, రెండు క్షణాలు గడవగానే ప్రకాశం, పరమేశాన్ని, "నాన్న ఏమన్నాడు, బావా?" అని అడిగాడు.

"మరేం లేదు. మీ అమ్మ ఇక్కడున్నది గదా, తీసుకు వెళ్ళడానికి వచ్చాడట! ఇక ఇద్దరూ పైలోకాలకు వెళ్ళిపోతారట. కోడలికి, ఇక అత్త కనబడదని బాధ పడ

వద్దని చెప్పమన్నాడు. మీ ఇద్దరినీ ఆశీర్వదించి ఇప్పుడే వెళ్ళిపోతారట,'' అని చెప్పాడు పరమేశం.

''నాన్న ఎప్పుడూ ఇంతే! ఒట్టి తొందర పాటు మనిషి,'' అన్నాడు ప్రకాశం నిష్ఠూరంగా.

భాగ్యం పాలిపోయిన మొహంతో, ఏమీ అర్థం కానిదానిలా ఇదంతా చూడసాగింది.

ఆ మర్నాడు చీకటితోనే లేచి, తన ఊరు వెళ్ళిపోయాడు పరమేశం. అతడి పక్క దుప్పటి తీసి దులుపుతున్న భాగ్యానికి, ఒక కాగితం కనిపించింది. అందులో ఇలా వున్నది: నిన్ను నా సొంత చెల్లెలిగా భావించి, ఈ ఉత్తరం రాస్తున్నాను. నువ్వు ప్రకాశానికి తల్లి మీద వున్న ప్రేమనూ, నమ్మకాన్నీ తెలివిగా నీ స్వార్థానికి వాడుకుంటున్నావు. కొత్తగా కాపరానికి వచ్చిన నువ్వు, నీ తిండిపుష్టికి సిగ్గుపడి అత్తగారి నాటకం ఆరంభించి వుంటావు. అత్తగారి పేరు మీద తాహతుకు మించి, నీ భర్తచేత అప్పులు చేయించి చీరెలూ సారెలూ కొనిపిస్తున్నావు. ఇంటి కొచ్చిన బంధువులను సాగనంపడానికి కూడా, అత్తగారిని అడ్డం పెట్టుకుంటున్నావు. నీ అత్తగారి నాటకానికి తెర దింపించేందుకే, నేను మామగారి నాటకం ఆడాను. ఇదంతా నీ మేలుకోసమే! సరే, ఈ జరిగినదానికి నా మీద, నీకు కోపం లేదనుకుంటాను. వచ్చే పండగకు, మీ ఇద్దరూ తప్పక, మా ఇంటికి రావాలి.

ఉత్తరం చదివిన భాగ్యానికి, ఇంత కాలంగా తానెంత అనాగరికంగా ప్రవర్తించిందీ అర్థమైంది. అంతలో ప్రకాశం పడక గది నుంచి బయటికి వస్తూ, ''ఏమిటి? ఏదో చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టున్నావు?'' అని అడిగాడు.

''మరేం లేదు. మన పెళ్ళయాక మొదటిసారిగా ఇంటికొచ్చిన అల్లుడికి బట్టలు పెట్టలేదు. ఈ రాబోయే పండగకు అన్నయ్యకూ, వదినెకూ మనమే కొత్త బట్టలు తీసుకుని, వాళ్ళ ఊరు వెళధాం!" అన్నది భాగ్యం సంతోషంగా.



# మహామూర్ఖుడు!

అడవిలో కట్టెలు కొట్టేవాడొకడు, మిట్టమధ్యాహ్నంవేళ ఏటిలో నీళ్ళు తాగి తిరిగి వస్తూండగా, ఇసుకలో ఏదో మెరుస్తూ కనిపించింది. వాడు దాన్ని పైకి తీసి పరీకగా చూడసాగాడు.

అంతలో ఆ దారిన పోతున్న వజ్రాలవ్యాపారి ఒకడు, వాణ్ణి సమీపించి, "ఏమిటలా వింతగా చూస్తున్నావు? అది గాజురాయి! ఇరవై రూపాయలిస్తాను, నా కివ్వు," అన్నాడు.

ఇది విన్న కట్టెలు కొట్టేవాడు, అవేదో ఖరీదైన రాయయివుంటుందనుకుని, "ముప్ఫయి రూపాయిలివ్వండి, ఇస్తాను," అన్నాడు.

"ఆ రాయి పదిరూపాయలకన్న ఎక్కువ చెయ్యదు. సరే, ఏదో పేదవాడివి సాయపడా లనుకుంటున్నాను. పాతికరూపాయలిస్తాను," అన్నాడు వజ్రాలవ్యాపారి.

"ముప్ఫయిరూపాయిలకు తక్కువయితే యివ్వను," అన్నాడు కట్టెలు కొట్టేవాడు మొండిగా.

వజ్రాలవ్యాపారి కొంచెంసేపు ఆలోచించాడు. ఈ అడవిలో దాన్ని కొనేందుకు ఎవడూ రాడని అతడికి తోచింది. ఆ కారణంగా వ్యాపారి, కట్టెలు కొట్టేవాడితో, "మరీ అంత దురాశకు పోకు! నేను ఈ పక్క గ్రామానికి వెళ్ళి గంటలో తిరిగివస్తాను. పాతికరూపాయిల కంటే నీకు చిల్లిగవ్వ ఎక్కువ ఇచ్చేదిలేదు," అంటూ వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత గంటసేపటిలో తిరిగివచ్చిన వజ్రాలవ్యాపారి, కట్టెలు కొట్టేవాడితో, "ఆలోచించుకున్నావా? ఆ పాతికా ఇస్తాను, ఆ రాయి ఇచ్చెయ్యి," అన్నాడు.

"ఇంకెక్కడిరాయి! ఇంతకుముందే మరొకరికి నూరు వరహాలకు అమ్మేశాను," అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

వజ్రాలవ్యాపారి అదిరిపడి, "నువ్వు మూర్ఖుడివి! అది గాజురాయి కాదు. దాదాపు పది వేల వరహాల విలువచేసే వజ్రం!" అన్నాడు.

అందుకు కట్టెలు కొట్టేవాడు, "నాకు దాని విలువ తెలియదు. కానీ దాని విలువ తెలిసీ, అదనంగా అయిదు రూపాయిలు ఇవ్వడానికి ఇష్టపడని నువ్వు, మహామూర్ఖుడివి!" అన్నాడు.

—ప్రేమ్‌కుమార్





# అపూర్వుడి సాహసయాత్రలు

## 3

[సదానందముని తన తపోశక్తితో యజ్ఞంనుంచి సృష్టించిన దివ్యశక్తులు గల అపూర్వుడనే విచిత్రవ్యక్తి ఏనుగుల సహాయంతో మంటలపాలైన పేదల ఇళ్ళను కాపాడాడు. ఆ పిమ్మట, బందిపోటు దొంగలు, తమ దేవతకు బలి ఇవ్వడానికి పట్టుకుపోయిన సమీరుడనే కుర్రవాణ్ణి వాళ్ళనుంచి కాపాడి అతడి గ్రామం పొలిమేరలో తెచ్చి వదిలాడు. —తరవాత]

సమీరుణ్ణి దూరంనుంచి చూడగానే, గ్రామస్థులు పట్టరాని సంతోషంతో అతడికేసి పరిగెత్తివచ్చారు. సమీరుడి తల్లి, "వచ్చావా నాన్నా!" అంటూ పరిగెత్తి వచ్చి అతణ్ణి కౌగలించుకుని ఆనంద బాష్పాలతో ముద్దాడింది.

"ఆ క్రూరులనుంచి ఎలా తప్పించుకున్నావు నాయనా!" అని అడిగాడు గ్రామాధికారి అతణ్ణి మెచ్చుకోలుగా.

"మన సమీరుడు ధైర్యసాహసాలు గలవాడే కాదు; చాలా తెలివిగలవాడు. అందుకే బందిపోట్ల నుంచి క్షేమంగా తప్పించుకోగలిగాడు." అన్నాడు మరొక గ్రామస్థుడు.

ఆ మాటలకు అక్కడున్న మిగతా వాళ్ళందరూ అవును అవును అన్నట్టు తలలూపసాగారు. అయినా సమీరుడు వినయంగా చేతులు జోడించి, "ఈ రోజు



చావునుంచి తప్పించుకోగలిగానంటే అందుకు నా ధైర్య సాహసాలూ, తెలివి తేటలూ కారణాలుకావు. ఆ భగవంతుడే ఒక దివ్యపురుషుడి ద్వారా నా ప్రాణాలు రక్షించాడు. అయినా, నేనొక్కణ్ణి బతికి ఏంప్రయోజనం? బందిపోట్లు మరెందరి ప్రాణాలనో బలిగొంటున్నారు కదా!'' అన్నాడు.

''నువ్వన్నది నిజమే. కాని, ఆ దుర్మార్గుల బారినుంచి కనీసం నువ్వయినా బయటపడగలిగావు. పరమక్రూరులయిన ఆ బందిపోట్లను ఎదుర్కోవడం మనవల్ల సాధ్యమయ్యే పనికాదు. రాజుగారి సైనికులు సైతం ఆ దుర్మార్గులను అణచలేక పోతున్నారుకదా!'' అన్నాడు గ్రామాధికారి విచారంగా.

''దేనికైనా ఒక అంతం వుంటుంది. ఇప్పుడు ఆ దుర్మార్గుల అంతం సమీపిస్తున్నది. అందుకు రాజుగారి సైనికులు కార్యరంగంలోకి దిగాలి. నావెంట వచ్చారంటే బందిపోటు దొంగలందర్నీ పట్టి ఇవ్వగలను,'' అన్నాడు సమీరుడు.

అతడి మాటలకు అందరూ విస్తుపోయారు. ముఖ్యంగా సైనిక దళనాయకుడు, ఆ కుర్రవాడికి మతి చలించిందేమో అని అతణ్ణి ఎగాదిగా వింతగా చూడసాగాడు. అయినా, గ్రామాధికారి సమీరుణ్ణి గురించి బాగా ఎరిగినవాడు కనుక, ఆయన వాణ్ణి ఆప్యాయంగా దగ్గరికి పిలిచి, ''ఇప్పుడు దొంగలు ఎక్కడున్నారో నీకు తెలుసా? ఒకవేళ నువ్వు మమ్మల్ని అక్కడికి వెంటబెట్టుకుని వెళ్ళినా, ఈలోగా వాళ్ళందరూ మరోచోటికి పారిపోగలరు కదా!'' అని అడిగాడు.

''ఒకవేళ బందిపోట్లు అక్కడేవున్నా, స్వల్పసంఖ్యలో వున్న మా సైనికులు, అసంఖ్యాకులైన ఆ దుష్టుల్ని ఎలా పట్టి బంధించగలరు?'' అన్నాడు దళనాయకుడు అనుమానంగా.

''ఆ బందిపోటు దొంగలందరూ ఒక గుహాముఖంలో స్పృహ తప్పి పడిపోయి

వున్నారు. మనం వెళ్ళేవరకు స్పృహ రాదు!'' అన్నాడు సమీరుడు.

''అలాగా!'' అన్న దళనాయకుడి ముఖంలో కొత్త వెలుగు కనిపించింది. సైనికులను తనవెంట రమ్మని ఆజ్ఞాపించి, అతడు సమీరుడి వెంట అడవికేసి బయలుదేరాడు.

''బాబూ, సమీరా! రాత్రంతా ఆకలితో అలమటించి వుంటావు. మళ్ళీ ఎప్పుడొస్తావో ఏమో. ఇంత తిని వెళ్ళు నాయనా!'' అన్నది సమీరుడి తల్లి.

''అనుకున్న పని పూర్తిచేసుకుని వచ్చాక తృప్తిగా తింటాను. ఆలస్యంచేస్తే వచ్చిన అవకాశం కాస్త చేజారిపోవచ్చు!'' అని చెప్పి సమీరుడు తల్లి వద్ద సెలవు తీసుకున్నాడు.

సమీరుడి వెంట దళనాయకుడూ, అతనివెంట ఆయుధాలు ధరించిన సైనికులూ, వాళ్ళ వెనకగా బాణాకర్రలూ, కత్తులూ పట్టుకున్న దృఢకాయులైన గ్రామస్థులు కొందరితో కలిసి గ్రామాధికారీ, అడవికేసి బయలుదేరారు.

వాళ్ళందరూ ఎంతో ఉత్సాహంగానూ, మరింత జాగ్రత్తగానూ చాలా దూరం నడిచి అడవిని సమీపించారు. దొంగల స్థావరం సమీపించగానే సమీరుడు, వాళ్ళందరినీ ఒకచోట ఆగమని చెప్పి,



తనుమాత్రం ఎదురుగుండా వున్న ఒక చిన్న కొండఎక్కి అవతలివైపుకు చూశాడు. దొంగలందరూ ఇంకా నిద్రపోతూనే వున్నారు. సమీరుడు చిన్నగా నవ్వి, దళనాయకుణ్ణీ, గ్రామాధికారినీ కొండపైకి రమ్మని సైగ చేశాడు.

వాళ్ళిద్దరితోపాటు మిగతా వాళ్ళుకూడా ఉత్సాహంగా ఆ చిన్న కొండను ఎక్కి గుహలున్న అవతలివైపు దిగారు. దళనాయకుడి ఆజ్ఞానుసారం, సైనికులు అక్కడి చెట్లకు అల్లుకుని వున్న బలమైన తీగలను కత్తులతో తెంచి, వాటితో నిద్రపోతూన్న దొంగలందరి చేతులూ వెనక్కు బంధించారు.



మత్తువదలి మొట్టమొదటకళ్ళుతెరిచిన భైరవమల్లు ఎదుట నిలబడిన దళనాయకుణ్ణి చూడగానే, హడలిపోయాడు.

''దుర్మార్గుడా....ఈ క్షణంతో నీ ఆట కట్టు. లేచి, మర్యాదగా మా వెంట నడిచిరా. తప్పించుకోవాలని చూశావో, ముళ్ళూ, రాయీ, రప్పా అని చూడకుండా బరబరా లాక్కుపోగలం. కాళ్ళు చేతులు ఊడిపోయినా రాజుకు నీ తలను అప్పగించగలం. జాగ్రత్త!'' అని హెచ్చరించాడు దళనాయకుడు.

ఒక్క నిమిషం చుట్టుపక్కల కలయజూసిన భైరవమల్లు, జరిగిన సంగతి గ్రహించిన వెంటనే చేతులకు కట్టిన తీగలను తెంచుకోవడానికి నోటితో కొరకబోయాడు. ఆ క్షణమే దళనాయకుడు పిటికిలి బిగించి, వాడి నోటి మీద గట్టిగా గుద్ది, ''ఇంకొక దెబ్బతో నీ పళ్ళన్నీ రాలిపోతాయి. పిచ్చిపిచ్చి వేషాలు వేశావో, నిన్నూ, నీ తోటిదొంగలనూ ఇక్కడే హతమార్చగలను. ప్రాణాలపై ఆశవుంటే నేను చెప్పినట్టు లేచినడువు,'' అన్నాడు.

దళనాయకుడి దృఢమైన కంఠస్వరం కొండలలో మారుమోగింది. ఆలోగా భైరవమల్లు ముఠాలోని దొంగలు ఒక్కొక్కరుగా మేలుకుని, తమకు దాపురించిన దుస్థితిని గ్రహించారు. సైనికులు కొరడాలు ఝుళిపించడంతో, దొంగలందరూ లేచి నిలబడి బెదురుచూపులు చూస్తూ ముందుకు నడిచారు. వాళ్ళకు ముందూ వెనక ఆయుధాలు ధరించిన సైనికులు నడుస్తున్నారు. దళనాయకుడూ, సమీరుడూ, గ్రామాధికారీ అందరికన్నా ముందు నడవసాగారు.

వాళ్ళందరూ సమీరుడి గ్రామం చేరే సరికి, చుట్టుపక్కల గ్రామాల నుంచి, అక్కడ గుమిగూడిన వందలాదిమంది ప్రజలు దొంగలను విచిత్రంగా చూడసాగారు. దొంగలు తలలు వంచుకుని నిలబడ్డారు. దొంగలు పూర్వం పెట్టిన బాధలు తలుచుకుని, కొందరు

గ్రామస్థులు వాళ్ళను కొట్టబోయారు. కాని, సమీరుడు అడ్డుపడి, ''ఆగండి! ఆగండి! దొంగలు పట్టుబడిపోయారుకదా? రాజుగారు వాళ్ళకు తగిన శిక్ష విధించగలరు. మీరు ఓర్పు వహించండి,'' అన్నాడు.

గ్రామస్థులందరూ, ''సమీరుడికీ జెయ్,'' అంటూ అతణ్ణి భుజాలపైకెత్తుకుని ఉత్సాహంగా గంతులు వేయసాగారు.

గ్రామాధికారి సమీరుడికీ, దళనాయకుడికీ, సైనికులకూ విందు ఏర్పాట్లుచేశాడు. భోజనాలయ్యాక, ఒక చెట్టు నీడలో నిలబడిన సమీరుడికి ఎవరో మెల్లగా ఈలవేయడం వినిపించింది. సమీరుడు ఆ దిక్కుకేసి తిరిగి చూశాడు. ఒక పొదరిల్లు చాటున అపూర్వుడు కనిపించాడు. పట్టరాని ఆనందంతో సమీరుడు అక్కడికి పరిగెత్తబోయి, అపూర్వుడు వద్దని సైగచేయడంతో అలాగే నిలబడ్డాడు. అపూర్వుడు అక్కడున్న విషయం ఎవరికీ తెలియకూడదని ఆయన ఆశిస్తున్నాడని గ్రహించిన సమీరుడు, ఎవరికీ అనుమానం కలగకుండా మెల్లగా పొదరింటిని సమీపించి, అపూర్వుడితో, ''మిమ్మల్ని చూడడం నాకెంతో ఆనందంగా ఉన్నది,'' అన్నాడు.

''బందిపోటు దొంగలను బంధించడానికి నువ్వుచూపిన నేర్పునాకూ ఆనందం



కలిగిస్తున్నది. అయినా, ఎంత దుర్మార్గులయినప్పటికీ దొంగలు కూడా మనుషులే కదా? వాళ్ళకూ ఆకలిదప్పులుంటాయి కదా? వాళ్ళకు తిండి పెట్టమని గ్రామాధికారికి చెప్పు,'' అన్నాడు అపూర్వుడు.

''అలాగే చెబుతాను దేవా!'' అన్నాడు సమీరుడు.

''సమీరా, నన్ను మిత్రమా అని పిలువు. అదేచాలు!'' అన్నాడు అపూర్వుడు చిన్నగా నవ్వుతూ.

* * *

దళనాయకుడు బంధించి రాజధానికి తీసుకువచ్చిన బందిపోట్లకందరికీ రాజు మరణశిక్ష విధించాడు. దొంగల కాళ్ళ



చేతులకు ఇనుపసంకెళ్ళు బిగించి, కారాగారంలో బంధించారు. మరణశిక్ష అమలు జరిగేవరకు ప్రాణాలు పోకుండా దొంగలకు కొద్దిగా తిండి పెడుతున్నారు. కారాగారంలో ఉన్న దొంగలు దిగులుగా ఒకచోట తలలు వంచుకుని కూర్చున్నారు. అప్పుడు ఒక దొంగ, "భైరవా, నీ కారణంగానేమాకీ గతి పట్టింది!"అన్నాడు కోపంగా.

"ఏమిటీ నన్ను పేరుపెట్టి పిలవడానికి నీకెన్ని గుండెలు! నేను మీ నాయకుణ్ణి. నిన్నటివరకు పిలిచీ పిలవగానే 'దొరా' అంటూ నా కాళ్ళమీదపడిన సంగతి మరిచిపోయావా?" అన్నాడు భైరవమల్లు ఆవేశంగా.

"నీవల్ల మనందరి ప్రాణాలు పోతాయన్న విషయం తప్ప నాకిప్పుడేదీ గుర్తు లేదు. ఇంకా మేము నిన్నెందుకు గౌరవించాలి?" అని ఆ దొంగ ఎదురుతిరిగాడు.

"నోర్ముయ్. నోరు తెరిచావో ప్రాణాలు తీస్తాను!" అన్నాడు భైరవమల్లు.

"నీకా కష్టంవద్దు. ఆ పని రాజుగారి భటులే చేస్తారు. మా ప్రాణాలే కాదు. నీ ప్రాణమూ తీస్తారు!" అన్నాడు దొంగ.

భైరవమల్లు పట్టరాని ఆగ్రహంతో పళ్ళు పటపట కొరికాడు. ఒకడు ఎదురు తిరిగితే, మిగతా దొంగలందరూ మౌనంగా ఊరుకున్నారు. అంటే, వాళ్ళూ ఆమాటల్ని ఆమోదించినట్టే కదా!

"మీకు మరణం నుంచి తప్పించుకోవాలని ఉన్నదా?" అన్న మధుర కంఠస్వరం ఒక మూలనుంచి వినిపించింది.

దొంగలందరూ ఆ కంఠం వినిపించిన దిక్కుకేసి తిరిగిచూశారు. చీకటిగా ఉన్న ఆ మూలకేసి చూస్తూ భైరవమల్లు, "ఎవరా మాటలన్నది?" అని అడిగాడు.

"మీరు పట్టుబడడానికి కారణమైన వాణ్ణి!" అన్నది కంఠస్వరం.

"మేము పట్టుబడడానికి కారణమైన వాడివయితే, మరి ఇప్పుడెందుకు మమ్మల్ని కాపాడాలనుకుంటున్నావు?" అని అడిగాడు భైరవమల్లు.



''నేరస్థులు మరణించడం నాకిష్టం లేదు. తప్పుచేసినవాళ్ళలో మార్పు వస్తే చూసి ఆనందిస్తాను. పాప భూయిష్టమైన బతుకులను సాగిస్తూ, ఎదుటి వారికి దుఃఖం కలిగిస్తూ, మిమ్మల్ని మీరే నాశ పరచుకుంటున్నారు. అటువంటి జీవితం నిరర్థకం కాబట్టి మిమ్మల్ని రాజు గారి సైనికులకు పట్టి ఇచ్చాను. ఇకపై మంచి మార్గంలో పయనిస్తామని మాట ఇచ్చా రంటే రాజుగారికి మీ మొర వినిపించి మీకు క్షమాభిక్ష ఇప్పిస్తాను,'' అన్నాడు అపూర్వుడు చీకటిలోంచి.

దొంగలు కొంతసేపు మౌనం వహిం చారు. ఆ తరవాత అందరూ ఏక కంఠంతో, ''మామీద కరుణించి మమ్మల్ని ఉరి శిక్ష నుంచి రక్షించు. ఈ క్షణంనుంచి నీఆజ్ఞాను సారం మంచి మార్గంలో పయనిస్తాము,'' అన్నారు.

''భైరవమల్లు అభిప్రాయం ఏమిటి?'' అని అడిగాడు అపూర్వుడు.

భైరవమల్లు దీర్ఘంగా నిట్టూర్చి, ''నేనూ ఒకప్పుడు సంతోషకరమైన శాంతియుత జీవితం గడపాలనే ఆశించాను. అయినా, క్రమేణా పరులను పీడించే పాప జీవి తానికి అలవాటు పడిపోయాను. ఇప్పుడు నువ్వు కాపాడావంటే జీవితాంతం నీ సేవ లోనే గడుపుతాను,'' అన్నాడు.

''నా సేవలో కాదు; ఆత్మ సేవలో జీవితాలు గడపండి. ఆత్మసేవలో, అంటే ధర్మమార్గంలో పయనించే వాళ్ళకు ఓటమి, అశాంతి వుండవు,'' అన్నాడు అపూర్వుడు.

''నాకు ఏమైనా ఫరవాలేదు. రాజుగారు వీళ్ళందరినీ క్షమించి వదిలిపెట్టి, నన్ను ఉరితీయించినా సంతోషిస్తాను,'' అన్నాడు భైరవమల్లు.

''నీలో వచ్చిన మంచి మార్పుకు నీ మాటలే నిదర్శనం. మీ గురించి రాజు గారికి తెలియజేస్తాను. అంతవరకు మీరు దైవప్రార్థనలు జరపండి. మీ అపరాధా లను క్షమించమని దేవుణ్ణి మనసారా

ప్రార్థించండి. ఆ దేవుడే మిమ్మల్ని రక్షించగలడు!'' అన్నాడు అపూర్వుడు.

*  *  *

మంచి మార్గంలోకి వస్తామని మాట ఇచ్చిన బందిపోట్లను క్షమించి వదలమని, సమీరుడు అపూర్వుడి మాటగా రాజుకు తెలియజేశాడు. కాని రాజు అందుకు అంగీకరించకుండా, ''ఆ దుర్మార్గులు అన్నెం పున్నెం ఎరుగని ప్రజలను చంపిన పరమ కిరాతకులు. వాళ్ళకు మరణశిక్ష విధించడమే న్యాయం!'' అన్నాడు.

''మహారాజా! ఆ దేవుడే వాళ్ళను క్షమించినట్టు నేను భావిస్తున్నాను,'' అన్నాడు సమీరుడు.

''అలాగా, అయితే నువ్వాదేవుడి ప్రతినిధివన్న మాట!'' అన్నాడు రాజు పరిహాసంగా.

''నేను దేవుడి ప్రతినిధిని కాను కాని, నన్ను దొంగల నుంచి రక్షించిన దివ్య పురుషుడి ద్వారా దేవుడి మాటలను వింటున్నాను,'' అన్నాడు సమీరుడు.

''శభాష్, ఆ దేవుడే వాళ్ళను రక్షించాలనుకున్నప్పుడు, ఏదైనా అద్భుతం చూపి రక్షించుకోవచ్చుకదా?'' అన్నాడు రాజు.

''దొంగలు ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నారు. పరమక్రూరులయిన వాళ్ళలో మానసిక పరివర్తన రావడమే ఒక మహా అద్భుతం కాదా?'' అన్నాడు సమీరుడు వినయంగా.

రాజు గట్టిగా నవ్వుతూ, ''నిజమే కావచ్చు! కాని నాకు మాత్రం అది చాలదు. ఆ దేవుడే భైరవమల్లును కాపాడాలని సంకల్పించాడు కదా! మరి నన్నడగడమెందుకు? వాణ్ణి ఉరితీసే తాటిని, ఒక మెరుపువంటి అగ్నిజ్వాలను పంపి ఛేదించవచ్చుకదా?'' అన్నాడు.

సమీరుడు నిరుత్సాహంతో వెనుతిరిగి వెళ్ళి, జరిగిన సంగతిని అపూర్వుడికి చెప్పాడు.

''రాజు చూడాలనుకున్న అద్భుతం తప్పక జరిగి తీరుతుంది!'' అన్నాడు అపూర్వుడు. —(ఇంకావుంది)






# కార్యదక్షత

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వెవరి ఆజ్ఞానువర్తివై, ఇంత అర్ధరాత్రి వేళ శ్మశానంలో ఇన్ని ఇక్కట్లను ఓర్చ గలుగుతున్నావో, నాకు తెలియదు. కాని, స్వామిభక్తీ, ఎనలేని ధైర్యసాహసాలూ గల ఎంతో వివేకవంతుడైనవాడికి తప్ప, సామాన్యులకు ఇది సాధ్యమయ్యే పని కాదు. అయితే, ఒక్కొక్కసారి ఇంత కార్యదీక్షగలవారు కూడా, అవమానాల పాలై, ఉన్న పదవిని కూడా కోల్పోతారు. ఇందుకు నిదర్శనగా కేశవుడనే గూఢ చారి నాయకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు



గిరిపురం రాజైన ధూమకేతుడు చాలా క్రూరుడు. విపరీతమైన రాజ్యకాంక్షకల వాడు. పొరుగున సర్వసంపదలతో తుల తూగుతున్న కాంభోజ రాజ్యాన్ని ఆక్ర మించుకోవాలన్నది, అతడి తీరని కోరిక. అయితే, ఆ రాజ్యం మీద దండెత్తి జయిం చడం, తన శక్తికి మించిన పని అని అతడికి తెలుసు. ఈ పరిస్థితిలో—ఒక సారి వనవిహారానికి వచ్చిన, కాంభోజ రాకుమారి మదాలసను, తన భటులను పంపి, పట్టి తెప్పించి, తన రాజ్యంలోని ఒక రహస్యస్థావరంలో బంధించాడు.

తర్వాత అతడు, ఒక దూత ద్వారా కాంభోజరాజుకు, ''మీ కుమార్తె మదాలస, మా అధీనంలో వున్నది. పది లక్షలవరహాలు కప్పంగా పంపితే, మీ కుమార్తెను పువ్వులలో పెట్టి తిరిగి పంపిస్తాం. చిన్న రాజ్యమని, మా మీదికి దాడికి వస్తే, మీ కుమార్తెను శవంగా మాత్రమే చూడగలరు!'' అని వర్తమానం పంపాడు.

వృద్ధమంత్రి, రాజుకు ధూమకేతుడి వర్తమానం గురించి మాత్రం చెప్పి, దూతతో ''మేము ఒక నెలలోగా కప్పం పంపగలమని, మీ రాజుతో చెప్పు.'' అని దూతను సగౌరవంగా పంపేశాడు.

ఇది చూసి రాజు కోపంగా, ''ఆ దుష్టుడు, మనం ధనం పంపితే మాత్రం, నా కుమార్తెను క్షేమంగా పంపగలడన్న నమ్మకం ఏమిటి?'' అని అడిగాడు.

''ప్రభూ, ఆ నీచుడికి మనం ఒక్క చిల్లిగవ్వ కూడా పంపే ప్రసక్తి లేదు. కేవలం వ్యవధికోసమే, దూతతో నేనలా చెప్పవలసి వచ్చింది.'' అన్నాడు మంత్రి.

రాజు కొంచెంసేపు ఆలోచించి, ''సరే, ఇప్పుడేం చేయడం?'' అన్నాడు ఏమీ పాలుబోక.

అందుకు మంత్రి, ''స్వామిభక్తి పరాయణుడూ, సమర్థుడూ అయిన గూఢ చారి నొకడిని పంపి, రాకుమారి ఎక్కడ

బంధితురాలై వున్నదో తెలుసుకుని, విడిపించి తీసుకువచ్చే ప్రయత్నం చేద్దాం,'' అన్నాడు.

ఇందుకు సమర్థుడు గూఢచారుల నాయకుడైన కేశవవర్మ అని, రాజూ, మంత్రీ నిర్ణయించారు.

ఆ మర్నాడు కేశవవర్మ, ఒక రాత్రీ, ఒక పగలూ ప్రయాణం చేసి, గిరిపురం సరిహద్దులోని నదీతీరాన్ని చేరాడు. అక్కడ ధూమకేతుడి సైనికశిబిరం వున్నది. కేశవవర్మ బెస్తవాడి వేషంలో నది దాటి, నగరం చేరి, ఒక వారం రోజులపాటు రకరకాలుగా ప్రయత్నాలు చేసి, చివరకు రాకుమారి నగరంలో లేదనీ, నదీతీరంలోని ఒకానొక అడవిలోని పాడుబడ్డ కోటలో బంధితురాలై వున్నదనీ తెలుసుకోగలిగాడు.

కేశవవర్మ ఒక రాత్రివేళ అడవిలోని కోట ప్రాంతం చేరి, చెట్లచాటునదాక్కుని, కోట పరిసరాలను పరిశీలిస్తూండగా, హఠాత్తుగా వెనక నుంచి అతడి తలపై గట్టి దెబ్బపడింది. కేశవవర్మ గిరుక్కున వెనుదిరిగి చూశాడు. సైనికుడొకడు ఒక చేతిలో కాగడా పట్టుకుని, రెండవ చేతిలో వున్న కర్రతో మరొకసారి కొట్టబోయేంతలో, అతడు కత్తిదూసి, వాడి గుండెల్లో పొడిచాడు. సైనికుడు కిందపడిపోతూ పెద్దగా అరిచాడు. ఆ అరుపు విన్న సైనికులు కోలాహలంగా అటుకేసి పరిగెత్తి రాసాగారు.





అతడిపై రాజుకు ఏమాత్రం నమ్మకం లేకపోయినా, చేసేదిలేక, ''సరే కేశవ వర్మను కలుసుకుని, అతడి ద్వారా, ఆ కోట వున్న ప్రాంతపు వివరాలు తెలుసుకుని వెళ్ళు.'' అన్నాడు.

''క్షమించండి, ప్రభూ! నేను కేశవ వర్మను కలుసుకోవడంవల్ల ప్రయోజనం ఏమీ వుండదు.'' అన్నాడు కృతసేనుడు.

రాజూ, మంత్రీ అతడి కేసి ఆశ్చర్యంగా చూశారు. అప్పుడు కృతసేనుడు, ''ఇంత జరిగాక ధూమకేతుడు, రాకుమారిని, ఆ కోటలోనే వుంచుతాడా?'' అన్నాడు.

ఇది విన్న తర్వాత రాజుకూ, మంత్రికీ ఈ యువకుడు తెలివైనవాడన్న అభిప్రాయం కలిగింది. రాజు, అతడితో, ''సరే, అలాగే నీ ప్రయత్నమేదో నువ్వు చెయ్యి.'' అని చెప్పాడు.

నాలుగు రోజుల తర్వాత కృతసేనుడు తిరిగి వచ్చాడు. రాజకుమారి లేకుండా ఒంటరిగా వచ్చిన, అతణ్ణి చూసి రాజు కోపంగా, ''ఏమో అనుకున్నాను. నువ్వు బుద్ధిహీనుడివే కాదు, పిరికివాడివి కూడా!'' అన్నాడు.

దానికి వినయంగా కృతసేనుడు, ''క్షమించండి, ప్రభూ! కార్యం సాధించడం, నా ఒక్కడివల్ల కాదు. ధూమకేతుడు, రాకుమారిని అడవిలోని కోట

వెంటనే కేశవవర్మ, సైనికుడి చేతి నుంచి జారిపడిన కాగడా తీసుకుని, కింద పడివున్న ఎండుటాకులకూ, చెట్లకూ నిప్పంటించి, అప్పుడు రేగిన రణగొణ ధ్వనిలో తప్పించుకుని, నాలుగైదు రోజుల తర్వాత కాంభోజనగరం చేరాడు.

తల మీద బలమైన గాయంతో, తనను చూడవచ్చిన కేశవవర్మ ద్వారా రాజూ, మంత్రీ జరిగింది తెలుసుకుని చాలా విచారపడ్డారు. మర్నాడు కృతసేనుడనే యువసైనికుడొకడు, రాజదర్శనానికి వచ్చి, తను రాజకుమార్తెను బంధవిముక్తురాలిని చేసి తేగలనని విన్నవించుకున్నాడు.

నుంచి తీసుకుపోయి, మన సరిహద్దుల్లో ప్రవహించే నది సముద్రంలో కలిసేచోట గల లంకలో, కట్టుదిట్టమైన సైనిక కాపలాతో బంధించాడు. ఆ లంకలో ప్రవేశించడమంటే, నేను రాకుమారి ఎక్కడ వున్నదీ తమకు తెలపకుండా మరణించడమే అవుతుంది,'' అన్నాడు.

రాజు వినుగ్గా, ''ఛీ, ఇక వెళ్ళు!'' అన్నాడు.

వృద్ధమంత్రి, రాజుతో కొంత సంప్రతించాక, సేనానాయకుడికి కబురు పంపి, అతడు రాగానే సంగతి సందర్భాలు వివరించి, ''నదిలో వున్న, ఆ చిన్న లంకను ముట్టడించి, రాకుమారిని రక్షించడం సాధ్యమా?'' అని ప్రశించాడు.

అందుకు సేనాని, ''సాధ్యమే, మహామంత్రీ! ధూమకేతుడికి అనుమానం కలక్కుండా, ఒక వందమంది మెరికల్లాంటి సైనికులకు బెస్తవాళ్ళ వేషాలు వేసి, నదిలో ప్రయాణించి, ఆ లంకను సునాయాసంగా చుట్టుముట్టి, రాకుమారిని క్షేమంగా తీసుకురాగలను,'' అన్నాడు.

''సరే! నీ ప్రయత్నం ఫలించగానే, మాకు కబురు పంపు. మేము వెంటనే సైన్యంతో వెళ్ళి, గిరిపురాన్ని ముట్టడించి, ధూమకేతుణ్ణి హతమార్చగలం,'' అన్నాడు వృద్ధమంత్రి.




ఈ విధంగా వృద్ధమంత్రి వ్యూహం విజయవంతమైంది. గిరిపురం కోట కాంభోజసైన్యాల వశమైంది. ధూమకేతుడు బందీగా చిక్కాడు.

విజయోత్సవంనాడు రాజు, మంత్రితో, ''మహామంత్రీ! ఈ ఆనందసమయంలో మనం కేశవవర్మను సన్మానించడం ఉచితంగా వుంటుందనుకుంటున్నాను,'' అన్నాడు.

వృద్ధమంత్రి వెంటనే, ''మహారాజా, సన్మానానికి అర్హుడు కేశవవర్మ కాదు, కృతసేనుడు,'' అన్నాడు.

రాజు కొద్దిసేపు ఆలోచించి, ''మీరన్నది నిజం!'' అని, కృతసేనుణ్ణి ఘనంగా

సన్మానించడమే కాక, కేశవవర్మను గూఢ చారుల నాయకత్వం నుంచి తొలగించి, ఆ పదవిని కృతసేనుడి కిచ్చాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, కాంభోజరాజు మంత్రి మాట విని, ఎంతో సమర్థుడూ, స్వామిభక్తి పరాయణుడూ అయిన కేశవవర్మను సన్మానించకపోగా, అతణ్ణి పదవీచ్యుతుణ్ణి కూడా చేయడం అన్యాయం కాదా? పిరికివాడని తానే నిందించిన కృతసేనుణ్ణి సన్మానించడమే కాక, అతణ్ణి ఎంతో బాధ్యతతో కూడిన గూఢచారులనాయకుడుగానియమించడం ఎలా న్యాయం అనిపించుకుంటుంది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''కేశవవర్మ సమర్థుడూ, స్వామిభక్తి పరాయణుడే కావచ్చు! కాని, అతడిది చాలా క్రోధ స్వభావం. క్రోధంవల్ల ఎంతటివాడికైనా వివేకం నశిస్తుంది. తన ప్రాణం మీదికి వచ్చేసరికి, అతడు అడవినే తగులబెట్టా లన్న ప్రయత్నం చేశాడు. ఆ సమయంలో, తానెవరినైతే రక్షించడానికి వచ్చాడో, ఆ రాకుమారి అక్కడే వున్నదన్న సంగతి మరిచిపోయాడు. ఇందువల్ల, కార్యసాధన జరక్కపోగా, సమస్య మరింత జటిల మైంది. ధూమకేతుడు రాకుమారిని మరొక రహస్యస్థావరానికి మార్చాడు. ఇది గ్రహిం చడంవల్లనే వివేకి అయిన కృతసేనుడు రాకుమారి ఎక్కడ వున్నదీ తెలుసుకుని తిరిగి వచ్చాడు. ఆ కారణంగానే, వృద్ధ మంత్రి పథకం పారి రాకుమారికి స్వేచ్ఛ లభించడమే కాక, దుష్టుడైన ధూమ కేతుడు పతనం కూడా చెందాడు. మంత్రి సలహా విన్న తర్వాత రాజు, ఇదంతా ఆలో చించే అర్హుడూ, కార్యదక్షుడూ అయిన కృతసేనుణ్ణి సన్మానించాడు;'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : డా॥ తాటిచెర్ల గురురామప్రసాద్ రచన]





# అద్భుతమైన విసనకర్ర

ఒకానొక రాజుకు విసనకర్రలంటే ఎంతో ఆసక్తి. సరదా. ఆయనవద్ద రకరకాల విసనకర్రలుండేవి.

ఒకనాటి పగటివేళ భోజనం ముగించి, పడకగది కేసి పోతూండగా, వీధిలోనుంచి విసనకర్రలమ్మేవాడొకడు, ''అద్భుతమైన విసనకర్రలు! అయినా కారుచౌక. ఒక్కొక్కదాని ఖరీదు యాభై బంగారు కాసులే. మీ ఇళ్ళలోని రుబ్బురోలు కంటే ఎక్కువకాలం ఉపయోగపడుతుంది,'' అంటూ అరవసాగాడు.

రాజు, నౌకరును పంపి విసనకర్రలమ్మేవాణ్ణి పిలిపించి, ''నీ దగ్గిరున్న విసనకర్రల గొప్పేమిటి? అంత ఖరీదు చెబుతున్నా వెందుకు?'' అని ప్రశ్నించాడు.

అందుకు వాడు, ''మహారాజా! ఇంత అద్భుతమైన విసనకర్రల్ని యాభై బంగారు కాసులకే అమ్ముతున్నా నంటే—అది చాలా తక్కువధర. ఇవి నూరు సంవత్సరాలకాలం ఉపయోగపడగలవని హామీ ఇస్తున్నాను,'' అన్నాడు.

''అలాగా! అయితే చూడడానికి మాత్రం, అంత గట్టిగా తయారు చేసినట్టు లేవు,'' అన్నాడు రాజు.

''మహారాజా! మిమ్మల్ని నేను మోసం చేస్తానా? నూరు సంవత్సరాలు కాదు, అంతకన్న ఎక్కువకాలమే ఉపయోగపడగలవు.'' అన్నాడు విసనకర్రలమ్మేవాడు.

రాజు, వాడికి యాభై బంగారుకాసులిచ్చి విసనకర్ర తీసుకుని, ''సరే, ఈ అద్భుతమైన విసనకర్ర ఏపాటిదో చూస్తాను. నెల రోజుల తర్వాత నా దగ్గరకొకసారి రా,'' అన్నాడు.

''చిత్తం, మహారాజా! దాన్ని ఎలా వాడాలో కాస్త చెప్పనివ్వండి,'' అన్నాడు విసనకర్రలమ్మేవాడు.

అనూప్ కిశోర్‌దాస్

ఇది వింటూనే రాజు చిరుకోపంగా, "విసనకర్రనెలా వాడాలో, నాకు నేర్పుతావా? అదేమైనా బ్రహ్మవిద్యా? ఇక వెళ్ళు!" అన్నాడు.

ఆ తర్వాత రాజు కొంతసేపు విశ్రమించి, ఆ కొత్త విసనకర్రతో విసురుకుని చూశాడు. దానిలో ఆయనకు ప్రత్యేకత ఏమీ కనిపించలేదు.

ఇలా పది రోజులు గడిచాక, ఒకనాడు విసనకర్రను బిగించిన కర్రబద్ద ఊడి వచ్చింది. దానితోపాటు కుట్టిన ఆకులన్నీ ఊడి చెల్లాచెదురుగా కిందపడినై.

అయితే, రాజు ఆశ్చర్యపడేలా నెల రోజులకల్లా విసనకర్రలమ్మేవాడు రాజదర్శనానికి వచ్చి, రాజుకు వంగి నమస్కరించి, "చిత్తం! తమ ఆజ్ఞమేరకు, తమ దర్శనానికి వచ్చాను. ఏమిటి సెలవు?" అన్నాడు.

రాజు పట్టరాని కోపంతో, "ఒరే, నువ్వు పరమమోసకారివి!" అంటూ జరిగింది చెప్పి, "ఆ విసనకర్రను ఇప్పుడు నువ్వు పోల్చుకోగలవా?" అంటూ ఛిన్నాభిన్నమైపోయిన విసనకర్రను చూపించాడు.

"మహారాజా, క్షమించాలి! విసనకర్రలో లోపం ఏమీ లేదు. దాన్ని సక్రమంగా ఉపయోగించడం, మీచేత కాలేదు." అన్నాడు విసనకర్రలవాడు.

"దాన్ని ఎలా ఉపయోగించాలంటావు?" అని అడిగాడు రాజు.

"మహారాజా! అది అద్భుతమైన విసనకర్ర అని, ముందే చెప్పాగదా! దాన్ని ఒక చేత్తో ఏమాత్రం కదిలించకుండా పట్టుకుని, మన తలను మాత్రమే దానిముందు అటూ ఇటూ కదిలించాలి!" అన్నాడు విసనకర్రలవాడు.

రాజు హాస్యప్రియుడు. ఆయన వాడి మాటలకు పొట్ట చెక్కలయ్యేలా నవ్వి, "ఆహాఁ, విసనకర్రలను గురించిన నీ పాండిత్యం అద్భుతమైనది! నా దగ్గిర ఎన్నో రకాల విసనకర్రలున్నవి. నిన్ను వాటికి రక్షకుడుగా నియమిస్తున్నాను." అని వాడికిఆస్థానంలో ఉద్యోగం ఇచ్చాడు



## మహనీయులు కలలుగన్న భారతదేశం:

# అంకితభావం!

భారత స్వాతంత్ర్య పోరాటానికి వివిధ రంగాలకు చెందిన ఎందరో ప్రముఖులు నాయకత్వం వహించారు. అలా ప్రజల విశేషాభిమానాలు చూరగొన్న వారిలో ప్రముఖ కవయిత్రి శ్రీమతి సరోజినీనాయుడు ముఖ్యురాలు.

కవికోకిల సరోజినీనాయుడు తండ్రి అఘోరనాథచటోపాధ్యాయ, హైదరాబాద్‌లోని నిజాం కళాశాల ప్రిన్సిపాల్‌గా పని చేశారు. 1879 వ సంవత్సరం హైదరాబాదులో జన్మించిన సరోజినీదేవి, బాల్యం నుంచే అభ్యుదయభావాలు కలిగి వుండేవారు. అందుకే ఆమె ఆ కాలంలోనే డా. గోవిందరాజులు నాయుడు గారిని వర్ణాంతర వివాహం చేసుకున్నారు. 1925 వ సంవత్సరం ఆమె భారత జాతీయకాంగ్రెస్ అధ్యక్షురాలయ్యారు.

ఆమె అడుగిడినచోటల్లా, పురాతన భారతీయ వైభవాన్ని గురించి అనర్గళంగా ఉపన్యసించి, ప్రజలలో నూతనోత్సాహాన్నీ, ఉద్వేగాన్నీ కలిగించేవారు. ఆమె తన రాజకీయ జీవితాన్ని ప్రారంభిస్తూ ప్రజలచేత ఇలా ప్రతిజ్ఞ చేయించారు: "పర్వతాలూ, నక్షత్రాలూ సాక్షిగా మనమందరం కలిసి కట్టుగా ముందుకు సాగుదాం. మన ఆలోచనలనూ, మాటలనూ, శక్తిసామర్థ్యాలనూ మాతృదేశ సౌభాగ్యం కోసం సమర్పిద్దాం!"

# మీకు తెలుసా?

1. మగబిడ్డ పుట్టగానే, అతణ్ణి వేటగాడిగా, సైనికుడిగా చేసే సంప్రదాయం మన దేశంలో ఎక్కడ వున్నదో మీకు తెలుసా?
2. ప్రపంచంలోకెల్లా చాలా ఎత్తయిన జలపాతం ఏది?
3. వెనిస్ నగరంలోని గొండొలా లాంటి పొడవాటి పడవలను మన దేశంలో ఎక్కడ ఉపయోగిస్తారు?
4. శ్రావణ బెళగొళలోని గోమతేశ్వర విగ్రహానికీ, కుతుబ్ మీనార్‌కూ ఎత్తులో వున్న సామ్యం ఏమిటో మీకు తెలుసా? (36 వ పేజీ చూడండి)



# మహాలక్ష్మి

దేవదానవులు అమృతం కోసం, మంధర గిరిని కవ్వంగానూ, వాసుకి సర్పాన్ని తాడు గానూ వేసి క్షీరసాగరాన్ని మధించినప్పుడు, అందులో నుంచి మొదట హాలాహలం బయటపడింది. ఆ తరవాత అమృతం వెలువడడానికి ముందు అనేక దివ్యవస్తువులతోపాటు మహాలక్ష్మి కూడా అవిర్భవించింది.

క్షీరసముద్ర రాజకుమారి అయిన లక్ష్మీదేవిని, మనిషి ఆశించతగిన సర్వసంపదలకూ అధిదేవతగా భక్తులు పూజిస్తారు. ధనధాన్య వస్తువాహనాది సకల సంపదలతోపాటు అచంచలమైన ధైర్యాన్నీ, జ్ఞానసంపదనూ, శాంతి సౌఖ్యాలనూ లక్ష్మీదేవి ప్రసాదిస్తుందని భక్తులు విశ్వసిస్తారు.

శ్రీమన్నారాయణుడి ధర్మపత్ని లక్ష్మీదేవి. అందుకే మహావిష్ణువును శ్రీపతి అని కూడా అంటారు. వైకుంఠధామంలో స్వర్గలక్ష్మిగానూ, ప్రతి ఇంటా గృహలక్ష్మిగానూ, రైతులు ధాన్యలక్ష్మిగానూ, వ్యాపారులు వాణిజ్యలక్ష్మిగానూ, వీరులు విజయలక్ష్మిగానూ లక్ష్మీదేవిని ఆరాధిస్తారు.

తామర పుష్పం మహాలక్ష్మికి చాలా ప్రీతిపాత్రమైన పుష్పం!

# చందమామ కబుర్లు

## బాలికల ప్రతిభ!

ఇటీవల పదవతరగతి పరీక్షలు రాసిన ఇద్దరు బాలికలు అందరి దృష్టినీ ఆకర్షించారు. ఎనిమిదేళ్ళ, ఏడు నెలలు మాత్రమే నిండిన మౌసమీ చటర్జీ అనే బెంగాలీ అమ్మాయి పదవతరగతి పరీక్షలు రాసి అద్భుతమైన జ్ఞాపకశక్తిని ప్రదర్శించింది! మహారాష్ట్రకు చెందిన సునీతా కదారూసావంత్, కాలివేళ్ళతోనే పరీక్షలు రాసింది. ఎందుకంటే, ఆమెకు రెండు చేతులూ లేవు! పరీక్ష రాయడానికి, ఆ అమ్మాయికి అందరి కన్నా అరగంట ఎక్కువ సమయం కేటాయించారు. కాని అందరి లాగానే ఆమె, నిర్ణీతసమయానికి అంటే మూడు గంటల లోపుగానే రాయడం పూర్తిచేసింది!





## అపనమ్మకం!

అమెరికా, బార్‌క్రాఫ్ట్ ఎలిమెంటరీ స్కూల్లో ఆంటోనీ ఎండర్సన్ అనే ఎనిమిదేళ్ళ కుర్రాడు చదువుతున్నాడు. ఒకనాడు అమెరికా అధ్యక్షుడు జార్జ్‌బుష్ ఆ స్కూలుకు వచ్చారు. తన ప్రక్కన నిలబడ్డ జార్జ్ బుష్‌ను, ఎండర్సన్ ప్రెసిడెంట్ అని నమ్మలేకపోయాడు. బుష్, తనే ప్రెసిడెంట్ అని నచ్చచెప్పడానికి తన ఫోటో వున్న డ్రైవింగ్ లైసెన్స్ చూపి ఎంతో ప్రయత్నించాడు. ఆఖరికి స్కూలుగేటు దగ్గర ఆపిన ప్రెసిడెంట్ వాడే కారును కూడా చూపాడు. అయినప్పటికీ ఆ కుర్రాడు ఆయన కేసి ఇంకా బలమైన సాక్ష్యం కావాలన్నట్టు నవ్వుతూ చూశాడు!

# సాహిత్యావలోకనం

1. భాస్కరుడు రచించిన ఒక గ్రంథంలో ప్రథమ అధ్యాయానికి తన కుమార్తె పేరు పెట్టాడు. ఆమె పేరేమిటి? ఆ గ్రంథం ఏది?
2. సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందిన మొట్టమొదటి సోవియట్ రష్యన్ రచయిత ఎవరు?
3. సి. వి. రామన్ ఒక పుస్తకం రాయడానికి, పువ్వుల రంగులు ప్రేరణ కలిగించాయి. ఆ పుస్తకం పేరేమిటి?
4. 'ది లాస్ట్ మేన్ ఇన్ యూరోప్' అన్న పుస్తకం మొదట వేరొక పేరుతో విడుదలయింది. ఆ పేరేమిటి? రచయిత ఎవరు?
5. మేరీ ఏన్ ఎవాన్స్, ఎరిక్ బ్లేయిర్—ఇవి సుప్రసిద్ధ రచయితల అసలు పేర్లు. ఆ రచయితలు ఎవరు?

## సమాధానాలు

మీకు తెలుసా?

1. కర్ణాటకరాష్ట్రం కూర్గ్ ప్రాంతంలో మగబిడ్డ పుట్టగానే, బిడ్డ చేతిలో చిన్న విల్లూ, బాణమూ వుంచి, తుపాకి పేలుస్తారు।
2. కర్ణాటకరాష్ట్రంలోని జోగ్ జలపాతం. 253 మీటర్ల ఎత్తునుంచి పడుతున్నది.
3. కాశ్మీర్ 'దాల్ లేక్'లో ఉపయోగించే షికారా పడవలు.
4. మొదటిది 17 మీటర్ల ఎత్తు ఉన్నది. రెండవ దాని ఎత్తు 71 మీటర్లు.

సాహిత్యం

1. లీలావతి; సిద్ధాంత శిరోమణి.
2. మిఖైల్ షొలొకోవ్; 1965 వ సం॥లో.
3. రంగులను గురించి వివరించే 'ది ఫిజియాలజీ ఆఫ్ విజన్'.
4. 1984, జార్జ్ ఆర్వెల్.
5. జార్జ్ ఇలియెట్, జార్జ్ ఆర్వెల్.



ప్రపంచ పురాణగాథలు-5

## పెర్సియస్ సాహసాలు

[గత సంచిక తరువాయి]

సాహసవీరుడైన పెర్సియస్, మెడుసా భూతాన్ని హతమార్చి, దాని తల నెత్తుకుని తిరిగివస్తూ, మార్గమధ్యంలో అండ్రోమీడాను మింగడానికి వచ్చిన వింత జంతువును చంపి ఆమెను రక్షించాడు. అండ్రోమీడా తల్లిదండ్రులు ఆమెను పెర్సియస్‌కు ఇచ్చి పెళ్ళి చేశారు.

పెళ్ళితంతు పూర్తికాగానే అండ్రోమీడా బంధువైన యువరాజు ఫినియస్, తన మిత్రులతో కలిసి, ఆమెను అపహరించుకుపోవడానికి ప్రయత్నించాడు. పెర్సియస్, మెడుసా తలను వాళ్ళకేసి చూపి, వాళ్ళందరినీ శిలలుగా మార్చి వేశాడు!





పెర్సియస్ అక్కడి నుంచి అండ్రోమీడాతో సహా తన తల్లి వుంటూన్న సెరిఫోజ్ దీవికి చేరాడు. సరిగ్గా ఆ సమయానికే, అతని తల్లి, అక్కడి రాజు పెట్టే హింసల నుంచి తప్పించుకోడానికి పరిగెత్తుతున్నది. ఆ దృశ్యం చూసి దిగ్భ్రాంతి చెందిన పెర్సియస్, మెడుసా తల సహాయంతో ఆ రాజును కూడా శిలగా మార్చివేశాడు.



అ తరవాత మెడుసా తలను ఉపయో గించుకోవడానికి ఇష్టం లేక, పెర్సి యస్, ఆలయానికి వెళ్ళి 'మినర్వా దేవత'కు దానిని అర్పించాడు. ముందు స్వశక్తి మీదే ఆధారపడాలని ఆయన నిర్ణయించాడు. ఆలయంలో కొన్నాళ్ళు ధ్యానంలో గడిపి, స్వస్థలమైన అర్గోస్‌కు బయలుదేరాలని నిశ్చయించాడు.




పెర్సియస్—తల్లినీ, భార్యనూ వెంట బెట్టుకుని అర్గోస్‌కు బయలుదేరాడు. పెర్సియస్ శిశువుగా ఉన్నప్పుడు, తాతచేత తల్లితో సహా సముద్రంలోకి నెట్టబడ్డాడు. ఇప్పుడు అతడు అందంగా అలంకరించిన పెద్ద పడవలో మళ్ళీ స్వస్థలానికి బయలుదేరాడు. అతని కీర్తి నలుదిశలా వ్యాపించింది.




పడవ లారిస్సా తీరంలో ఆగింది. లారిస్సారాజు వాళ్ళకు గౌరవంగా స్వాగతం పలికాడు. తన తండ్రి జ్ఞాపకార్థంగా లారిస్సారాజు వేడుకలు ఏర్పాటు చేశాడు. ఆ రాజు మీది గౌరవం కొద్దీ పెర్సియస్ ఆ వేడుకలసందర్భంగా అక్కడ ఏర్పాటు చేసిన ఆటలలో పాల్గొనడానికి అంగీకరించాడు.
Balu

అక్కడ ఏర్పాటు చేసిన వివిధ క్రీడలలో పాల్గొంటూ, పెర్సియస్ ఒక బలమైన రాతిచక్రాన్ని గిరగిరా తిప్పి దూరంగా విసిరాడు. అది గురి చూసిన స్థలానికి కాస్త దూరంగా పోయి, అప్పుడే అక్కడికి వస్తూన్న ఒక వృద్ధుడి మీద పడింది!





దాని దెబ్బకు కిందపడిన వృద్ధుడు ఆ క్షణమే ప్రాణాలు కోల్పోయాడు. ఆయన పెర్సియస్ తాతగారయిన అర్గోస్‌రాజు అక్రిసియస్! మనవడు వస్తున్నాడు, వాడి కంటపడకూడదని అక్రిసియస్ అక్కడి నుంచి ఈ ద్వీపానికి వచ్చాడు. అయినా, ఇక్కడ అతడు అనుకోకుండా పెర్సియస్ విసిరిన రాతిచక్రం తగలడంతో ప్రాణాలు కోల్పోయాడు. జ్యోతిష్కుల మాటలు అలా నిజమయ్యాయి!

ఆ తరవాత పెర్సియస్ అక్కడి నుంచి అర్గోస్ చేరుకున్నాడు. కాని, చేజేతులా తన తాతను చంపానన్న విచారంవల్ల, పెర్సియస్, తాత కూర్చున్న సింహాసనంపై కూర్చోవడానికి అంగీకరించలేదు.





పెర్సియస్ మైసీనన్ అనే కొత్త నగరాన్ని స్థాపించి, అక్కడి నుంచి రాజ్యపాలన జరిపాడు. అంద్రోమీడాతో కలిసి ఆయన చిరకాలం ప్రజారంజకంగా ధర్మపరిపాలన జరిపి, అందరి మన్ననలూ పొందాడు.

పెర్సియస్ అనంతరం, ప్రజలు అతణ్ణి దైవాంశ సంభూతునిగా భావించి, పూజించసాగారు. అతని రూపంలో ఒక పెద్ద విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. ఆ ప్రాంతంలో అదొక ప్రత్యేక ఆకర్షణగా చిరకాలం వెలిసింది.





పెర్సియస్ కుమారులలో ఒకడైన పెర్సస్, పర్షియాను స్థాపించాడు. పర్షియనులు పెర్సస్ సంతతికి చెందినవారుగానే భావిస్తారు. ఎన్నో కథలు, కావ్యాలు, నాటకాలు రచించడానికి పెర్సియస్ జీవితగాథ ఎందరికో ప్రేరణ కలిగించింది. శ్రీ అరవిందులు కూడా పెర్సియస్ నాటకం రచించారు.




# అన్వయమంత్రి

ఒకానొకప్పుడు కోసలదేశాన్ని చిత్రముఖుడనే రాజు పరిపాలించేవాడు. ఆయన మంత్రి సుబుద్ధి, పేరుకు పూర్తిగా వ్యతిరేకం. తనమంత్రి అవినీతిపరుడని తెలుసుకునేందుకు రాజుకు ఎంతోకాలం పట్టలేదు. ఆయన అసలు విషయం బయటపెట్టకుండా సమర్థుడు, నీతిపరుడు, నిజాయితీని నమ్మినవాడు అయిన వ్యక్తికోసం, స్వయంగా అన్వేషించసాగాడు. చివరకు ఒక గ్రామంలో గురుకులం నడుపుతున్న, అన్వయుడు అన్నివిధాలా మంత్రిపదవికి తగినవాడని ఆయన నిర్ణయించి, ఆ విషయం లేఖ ద్వారా అన్వయుడికి తెలియబరిచాడు.

అన్వయుడు దీనికాశ్చర్యపడి, వెంటనే రాజధానికి బయలుదేరి చిత్రముఖుణ్ణి కలుసుకుని, "ప్రభూ! గురుకులాన్ని నడుపుకోవడంలో నాకెంతో తృప్తివుంది. రాజకీయాలు నాకు నచ్చవు. ఈ విషయం మీకు లేఖ ద్వారా తెలియపర్చడం మర్యాదకాదని, స్వయంగా చెప్పేకునేందుకు వచ్చాను. నాకు మంత్రిపదవి వద్దు," అన్నాడు.

చిత్రముఖుడు, అన్వయుడితో, "మీకు పదవీవ్యామోహం లేదు. మీవంటివారే మంత్రిపదవికి అర్హులు. నా మంత్రి సుబుద్ధి పదవీవ్యామోహంతో, అవినీతికి పాల్పడ్డాడు. ధనవ్యామోహంతో ప్రజాక్షేమాన్ని మరిచాడు. అందుకే అతణ్ణి పదవి నుంచి తొలగిస్తున్నాను. ప్రజాక్షేమాన్ని కోరి మీరీ పదవిని స్వీకరించి, అసమర్థులను కనిపెట్టి, వాళ్ళను తగురీతిగా శిక్షించండి. సమర్థులకే అన్ని పదవులూ లభించేలా చూడండి. మీ గురుకులం నడిపే ఏర్పాట్లు నేను చేస్తాను," అన్నాడు.

"వసుంధర"



రాజు మాటలు కాదనలేక, అన్వయుడు మంత్రిపదవికి ఒప్పుకున్నాడు.

అన్వయుడు మంత్రి కావడం, తన పదవిపోవడం సుబుద్ధికి ఆశ్చర్యాన్ని కలిగించింది. అయితే ఇలా జరుగుతుందని ముందుగా తెలియకపోవడంవల్ల, తన తప్పులు దాచిపెట్టుకునే అవకాశం లేకపోయింది. మొదటి రోజునే అన్వయుడు, సుబుద్ధికారణంగా జరిగిన పొరబాట్లు చాలా తెలుసుకుని అతణ్ణి సంజాయిషీ అడిగాడు.

సుబుద్ధికి ఏం చెప్పాలో తెలియక, "పొరబాట్లు జరిగిన మాట వాస్తవం. కానీ నేను నిర్దోషిని. నా క్రింద పని చేసే అధికారులందర్నీ నేను నమ్మాను. రాజుగారికి అవసరమైన కొన్ని ముఖ్య రాజకీయ వ్యవహారాలు తప్ప, మిగతావన్నీ నా క్రింది అధికారులే చూస్తున్నారు," అంటూ నెపం వేరే వాళ్ళ మీదికి నెట్టేశాడు.

సుబుద్ధి క్రింద పనిచేసే అధికారులు వందమంది వున్నారు. అన్వయుడు మరునాడు వాళ్ళందర్నీ కలుసుకుని ప్రశ్నించాడు. తప్పంతా మంత్రిదేననీ, ఆయన ఎలా చెబితే అలా చేశామనీ అధికారులన్నారు.

"అంటే మంత్రి చాలా పొరబాట్లు చేశాడు. ఇలాంటి పొరబాట్లు చేసే మనిషి దుర్మార్గుడూ, స్వార్థపరుడూ అయుండాలి. మంత్రి అలాంటి వాడనడానికి, మీ దగ్గిర ఋజువులున్నాయా?" అని అడిగాడు అన్వయుడు.

"సుబుద్ధి దుర్మార్గాలను బయటపెట్టడానికి, మాలో ప్రతి ఒక్కడి దగ్గిరా వందలకొద్దీ ఋజువులున్నాయి," అన్నాడు అధికారుల్లో ఒకడు.

"సరే, మనం మళ్ళీ రేపు కలుసుకుందాం. అప్పుడు నేను సుబుద్ధి గురించి, మీ నుంచి నాక్కావలసిన వివరాలు తెలుసుకుంటాను," అని అన్వయుడు వాళ్ళందర్నీ పంపించేశాడు.

తర్వాత అన్వయుడు, సుబుద్ధిని వెంట బెట్టుకుని రాజువద్దకు వెళ్ళి, "ప్రభూ! సుబుద్ధి పదవిలో తన క్రింది అధికారులను శాసించాడే తప్ప, వారి నిజమైన అభిమానాన్ని పొందలేకపోయాడు. అందుకే పదవి పోగానే వాళ్ళందరూ ఇతడికి వ్యతిరేకంగా మారిపోయారు," అని చెప్పాడు.

"అయితే ఇతడికేం శిక్ష నిర్ణయించారు?" అన్నాడు రాజు.

"ఆ విషయం రేపటికిగాని తేలదు," అన్నాడు అన్వయుడు.



మర్నాడు వందమంది అధికారులనూ అన్వయుడెలా విచారణ చేస్తాడో చూడాలని, రాజు కూడా అన్వయుడి పక్కనే వున్నాడు. అన్వయుడు, రాజు ఒక గదిలో పక్కపక్కనే ఆసనాల మీద కూర్చుంటే, ఒక్కొక్క అధికారి విడివిడిగా వచ్చి వాళ్ళను కలుసుకున్నారు.

అన్వయుడు ముందుగా వచ్చిన అధికారితో, "పాతమంత్రి సుబుద్ధి గురించి నీకేం తెలుసో చెప్పు," అన్నాడు.

వెంటనే ఆ అధికారి, సుబుద్ధికున్న దురలవాట్లన్నీ ఏకరువు పెట్టబోతే, సుబుద్ధి అతణ్ణి వారించి, "ఇవన్నీ నేను వినదల్చుకోలేదు. సుబుద్ధిలోని మంచి గుణాల గురించి కానీ, సమర్థత గురించి కానీ ఏమైనా తెలిస్తే చెప్పు, లేదా వెళ్ళిపో," అన్నాడు.

ఆ అధికారి ఏమీ చెప్పలేక వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఒకొక్కరుగా వంద మంది అధికారులూ వచ్చి వెళ్ళారు. వారిలో పదిమంది మాత్రం, సుబుద్ధిలో కొన్ని మంచి గుణాలున్నట్లు చెప్పారు. వాటిలో ముఖ్యమైనదేమిటంటే—సుబుద్ధి తనకిష్టమైన పనులన్నీ నయానో భయానో తన క్రింది ఉద్యోగులచేత చేయించగల దన్నది!

అందరూ వెళ్ళిపోయాక అన్వయుడు, రాజుతో—సుబుద్ధిలోని మంచి గుణాలు చెప్పిన పదిమందినీ వుంచి, మిగతా తొంభై

మందినీ అధికారం నుంచి తొలగించా లన్నాడు. అంతేకాక, పాత.మంత్రి సుబుద్ధిని కారాగారంలో నేరస్థుల యోగ క్షేమాలు విచారించే అధికారిగా నియ మించాలన్నాడు.

రాజు ఆశ్చర్యపడి, "ఇదేమి నిర్ణయం మీది? తప్పుచేసిన సుబుద్ధికి వేరేపదవి ఇవ్వాలంటున్నారు. సుబుద్ధి మాట విన్న క్రింది ఉద్యోగుల్ని పనిలోంచి తీసివేయా లంటున్నారు. న్యాయంగా వుందా?" అని ప్రశ్నించాడు.

అన్వయుడు నవ్వి, "ప్రభూ! సుబుద్ధి తప్పుచేసి వుండవచ్చు. కానీ అతడి క్రింద పనిచేసేవారెవ్వరూ తమ కతడిపై ఫిర్యాదు చేయలేదు. అంటే, అతడు తన క్రిందివారిలో కొంత భయం పుట్టించాడన్న మాట! అందుకు కొంత సమర్థత అవసరం. ఆ సమర్థతను మనం ఉపయో గించుకోవాలి. తనకిష్టమైన పనులు తన క్రిందివారిచేత నయానాభయానా చేయించ గల శక్తి అతడికుంది. ఇక నుంచి కారా గారం అధికారిగా అతడు తన క్రిందివారి చేత ఏం చేయించాలో నేను నిర్ణయించి పర్యవేక్షిస్తాను. ఆ విధంగా ఎందరో నేరస్థులను సంస్కరించవచ్చు. అదీకాక, ఈ ఉద్యోగంవల్ల సుబుద్ధి ఎక్కువసేపు కారాగారంలో నేరస్థుల మధ్య గడపాలి. అదే అతడికి తగిన శిక్ష. ఇక సుబుద్ధి క్రింద పనిచేసిన ఉద్యోగులంటారా? ఎదుటివారిలో చెడునేతప్ప మంచినిచూడ లేనివారు రాజోద్యోగులుగా వుండకూడదు. అందుకే అటువంటి వారైన నూటికి తొంభై మందిని పనిలోంచి తీసివేయాలన్నాను," అన్నాడు.

"మీరు నేననుకున్నదానికంటే చాలా గొప్పవారు. మంత్రి అంటే అన్వయ మంత్రే మంత్రి!" అని రాజు చిత్ర ముఖుడు అన్వయుణ్ణి ఎంతగానో మెచ్చు కున్నాడు.

ఆ తర్వాత అన్వయుడి సమయోచిత మైన సలహాలతో, చిత్రముఖుడు ఎంతో కాలం సుఖంగా రాజ్యమేలాడు.





# వీరహనుమాన్

హనుమంతుడు లంకానగరంలోకి పోతూంటే అతనికి రకరకాల రాక్షసులు కనిపించారు. యజ్ఞదీక్షలో ఉన్నవాళ్ళూ, జడలు ధరించినవాళ్ళూ, తలలు గొరిగించుకున్నవాళ్ళూ, ఎద్దుతోలు కట్టుకున్నవాళ్ళూ, అభిచారహోమాలు చేసి శత్రువుల మీద చేతబడి చేసేవాళ్ళూ, రకరకాల ఆయుధాలు పట్టుకుని తిరిగేవారూ, వికారాకారులూ, పొట్టివాళ్ళూ, నల్లగా ఉండేవారూ, చేటల్లాటి చెవులుగలవాళ్ళూ, అందంగా ఉన్నవాళ్ళూ, ధ్వజాలు పట్టుకు తిరిగేవాళ్ళూ లంకలో ఉండటం హనుమంతుడు చూశాడు.

రాత్రి గడుస్తున్నది. ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. హనుమంతుడు రావణుడు ఉండే ప్రాసాదంలోకి ప్రవేశించాడు. స్త్రీలు పాడుతున్నారు. కొందరు తమ శరీరాలకు చందనలేపాలు పూసుకుంటున్నారు. కొందరు అప్పుడే నిద్రపోతున్నారు.

తనకు కనిపించే స్త్రీలలో మనుష్యస్త్రీ అయిన సీత ఎక్కడన్నా కనబడుతుందేమోనని హనుమంతుడు చాలా శ్రద్ధగా చూశాడు. కాని అతనికి సీతలాటి స్త్రీ ఎక్కడా కనిపించలేదు. హనుమంతుడికి హఠాత్తుగా దిగులు పట్టుకున్నది. అతను కామరూపి కనక, అనుకూలమైన రూపం ధరించి లంక అంతా చెడతిరిగి, కొంతసేపటికి మళ్ళీ రావణుడి గృహానికి వచ్చాడు.

12. సీతా సందర్శనం



హనుమంతుడు రావణుడి భవనం అంతటా తిరగసాగాడు. ఆ భవనంలో మంచాలూ, బల్లలూ, ఆసనాలూ, పాత్రలూ అన్నీ బంగారంతో చేసినట్టు కనిపించాయి. మణులు పొదిగిన కిటికీలతో పక్షుల పంజరాలున్నాయి. హనుమంతుడికి పుష్పకవిమానం కూడా కనబడింది. అది మొదట కుబేరుడిది. అందులో కొండలూ, భూమీ, పూలచెట్లూ, పద్మాలు గల కోనేరులూ చిత్రించి ఉన్నాయి. అది చాలా పెద్ద విమానం. అందులో ఎంతమందికైనా చోటు ఉంటుందట. ఏ ఇంటికన్న కూడా పెద్దదిగా ఉన్న ఆ పుష్పక విమానం చూసి ఆశ్చర్యపడి, హనుమంతుడు రావణుడి భవనం కలయతిరగ సాగాడు. ఎంత తిరిగినా ఆ భవనాన్ని పూర్తిగా చూసినట్టు హనుమంతుడికి తోచలేదు. అతనికి సీత మాత్రం ఎక్కడా కనపడలేదు.

రావణుడి ఇల్లు హనుమంతుడికి అద్భుతంగా కనబడింది. దాన్ని వెండితో నిర్మించి బంగారు అలంకరణలు చేశారు. దానికి రంగురంగుల తోరణాలున్నాయి. వాకిళ్ళు చక్కని అలంకరణలు కలిగి ఉన్నాయి. మేలుజాతి ఏనుగులూ, గుర్రాలూ ఉన్నాయి. మహాశూరులైన రాక్షసులు ఆ ఇంటికి కాపలా కాస్తున్నారు. స్త్రీలూ, పురుషులూ అటూ ఇటూ తిరుగుతున్నారు. వాతావరణం చాలా సందడిగా ఉన్నది. అంతటా సుఖ సౌఖ్యాలు తాండవిస్తున్నాయి. ఆ ఇల్లు ఇంద్రభవనం లాగా ఉండి, లంకానగరానికి ఒక గొప్ప అలంకారంగా ఉన్నది.

రావణుడి భవనంలోగల అన్ని మందిరాలూ తిరిగి, హనుమంతుడు రావణుడి భార్యలు ఉండే అంతఃపురంలో ప్రవేశించాడు. రావణుడి స్త్రీలలో రాక్షస స్త్రీలూ, రావణుడు తన పరాక్రమంతో తెచ్చిన రాజకన్యలూ, అతన్ని వలచి వచ్చిన వారూ ఉన్నారు. అంతటా దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

రావణుడి అంతఃపురంలో అనేకమంది స్త్రీలు నిద్రావస్థలో ఉన్నారు. వాళ్ళు చిత్రకంబళాల మీద, రకరకాల బట్టలూ, నగలూ, పూలమాలలూ ధరించి పడుకుని ఉన్నారు. అప్పటికి అర్ధరాత్రి గడిచి ఉండటంచేత, ఎక్కడ కూర్చుండినవారు అక్కడే రకరకాల భంగిమలలో ఒళ్ళు మరిచి నిద్రిస్తున్నారు.



హనుమంతుడు శ్రద్ధగా అందరి ముఖాలలోకి చూశాడు. అతను మంచం మీద నిద్రపోతున్న రావణుణ్ణి కూడా పరిశీలించి చూశాడు. రావణుడి చేతులు అయిదు తలలు గల మహాసర్పాలలా గున్నాయి. అతని శరీరానికి రక్తచందనం పూసి ఉన్నది. పెద్ద శరీరం గలిగి అతను పడుకున్న పర్వతం లాగున్నాడు. అతని శరీరమంతటా రకరకాల ఆభరణా లున్నాయి.

రావణుడి లాగే, అతని భార్య మండోదరి కూడా వేరే ఒక మంచం మీద పడుకుని ఉన్నది. ఆమె అందచందాలూ, యౌవనమూ చూసి హనుమంతుడు, ఆమె సీత అయి వుంటుందనుకుని చాలా సంతోషించాడు.

కాని మరుక్షణమే అతని ఆనందం మాయమయింది. రాముణ్ణి విడిచిన సీత అలంకరించుకుంటుందా? ఆమెకు నిద్రాహారాలుంటాయా? ఆమె పరపురుషుడికి భార్య అవుతుందా? తాను చూసినది సీత కాదని హనుమంతుడు నిర్ణయించుకున్నాడు. అతను అక్కడి నుంచి కదిలాడు.

హనుమంతుడు సీత కోసం ప్రతి పొదరిల్లూ, ప్రతి చిత్రశాలా వెతికాడు. అతనికి ఒక అనుమానం వచ్చింది: సీత చచ్చిపోయి ఉంటుందా? తనకు లోబడలేదని రావణుడు ఆమెను చంపేసి ఉంటాడా? లేక ఈ వికారాకారులైన రాక్షసస్త్రీలను చూసి సీత ప్రాణాలు పోయి ఉంటాయా? సుగ్రీవుడు పెట్టిన గడువు తీరిపోయి ఎంతో కాలమయింది గదా, సీతను చూడకుండా



ఎలా తిరిగిపోవటం? తాను ఇలాగే తిరిగి పోతే, "నువ్వు ఎందుకు వెళ్ళి వచ్చినట్టు?" అని అందరూ తనను అడగరా? తను ఏమని చెప్పాలి?

ఏమైనా చింతిస్తూ కూర్చోవటం వల్ల ఫలం ఉండదనుకుని హనుమంతుడు దూర ప్రదేశాలు వెతకటానికి బయలుదేరాడు. అతను ఎత్తులు ఎక్కాడు. లోతులు దిగాడు. పాతాళ గృహాలు ప్రవేశించాడు. అడవులూ, బావులూ వెతికాడు. అతనికి ఎందరెందరో రాక్షస స్త్రీలు కనిపించారుగాని, సీత మాత్రం కనబడలేదు. అందగత్తెలు కనిపించినప్పుడల్లా అతనికి ఆశ కలిగేది; వాళ్ళు సీత కారని తెలియగానే విచారం పట్టుకునేది. సీత, రావణుడు తీసుకువస్తూ ఉండగానే మధ్యదారిలో పడిపోయిందేమో? భయపడి సముద్రంలో పడిపోయిందేమో? లేక రాముడి కోసం మనోవేదనపడి చచ్చిపోయిందో?

సీతను తాను చూడలేని పక్షంలో హనుమంతుడు సముద్రతీరాన చితి పేర్చుకుని, కాలి పోవటానికి సిద్ధపడ్డాడు. అలా కాకుండా రావణాసురుణ్ణి చంపేస్తే తగిన ప్రతిక్రియ అవుతుందని అతనికి తోచింది. లేకపోతే రావణుణ్ణి యజ్ఞపశువు లాగా పట్టుకుని తీసుకుపోయి రాముడి ముందు పెట్టవచ్చు!

అలా అనుకుంటున్న హనుమంతుడికి దూరంగా, ఎత్తయిన చెట్లుగల వనం ఒకటి కనబడింది. అది అశోకవనం. హనుమంతుడు ఆ వనాన్ని ఇంకా వెతకలేదు. దాని జాడ కూడా అతనికి ఇప్పుడే తెలిసింది. అక్కడ కూడా సీత కోసం వెతకటానికి హనుమంతుడు నిశ్చయించుకున్నాడు.

అతను అతివేగంగా దూకుతూ అశోకవన ప్రాకారం చేరాడు. అతను తన దేహాన్ని మరింత చిన్నదిచేసి, ఆ వనంలో రకరకాల చెట్లు చూశాడు. అప్పుడే అరంభమవుతున్న వసంతకాలం కారణంగా



తయారుచేసిన కృత్రిమ వృక్షాలూ కని పించాయి.

అశోక వనంలో ఒక క్రీడా పర్వతం కూడా ఉన్నది. దాని మీద ఎత్తయిన వింత శిఖరాలూ, అనేక రాతి ఇళ్ళూ, చెట్లూ ఉన్నాయి. దాని మీది నుంచి ఒక నది లాంటిది కిందికి ప్రవహిస్తున్నది. వనంలో ఒక దిగుడు బావి ఉన్నది. దాని చుట్టూ ఎత్తయిన మేడలున్నాయి. బంగారు తిన్నెలున్నాయి.

హనుమంతుడు దట్టమైన ఆకులు గల చెట్టు మీద కూర్చుని చుట్టూ కలయ జూశాడు. కొంత దూరంలో అతనికి తెల్లగా ఒక చైత్యప్రాసాదం కనిపించింది. ఆ అద్భుతప్రాసాదానికి వెయ్యి స్తంభా లున్నాయి. ఆ ప్రాంతంలోనే హను మంతుడికి సీత కనబడింది.

ఆమె చిక్కిశల్యమై ఉన్నది. మాసి పోయిన పసుపు పచ్చ చీర ధరించి ఉన్నది. గొప్ప విచారంలో, కన్నీరు కార్చుతూ ఉన్నది. ఆమె చుట్టూ రాక్షస స్త్రీలు ఉన్నారు. రావణుడు ఎత్తుకు పోయినప్పుడు హనుమంతుడు ఆమెను చూశాడు. ఆ పోలికలు కొన్ని కనిపిస్తూ న్నప్పటికీ, ఆమెలో మార్పు చాలా ఉన్నది. ఆమె ఋశ్యమూక పర్వతం మీద కొన్ని నగలు పడేసింది. అలా పడవెయ్యని

సాలవృక్షాలూ, అశోకవృక్షాలూ, చంపక వృక్షాలూ, ఉద్దాలకవృక్షాలూ, నాగ వృక్షాలూ, మామిడి చెట్లూ, కపిముఖాలు అనే చెట్లూ, చక్కగా పూతపట్టి ఉన్నాయి. అనేక వృక్షాలకు లతలు పెనవేసుకుని ఉన్నాయి.

ప్రాకారం మీద కూర్చుని ఉన్న హనుమంతుడు చెట్లలోకి బాణం లాగా దూకి, చెట్ల మీదుగా పోసాగాడు. చెట్ల మీద నిద్రపోతున్న పక్షులు కలవర పడుతూలేచి, అరిచాయి. చెట్ల మీది పూలు అతని శరీరం నిండా పడ్డాయి. అతనికి ఆ అశోకవనంలో కోనేరులూ, తిన్నెలూ, వెండి బంగారాలతో అలంకారార్థం

ఆభరణాలను రాముడు వర్ణించి చెప్పాడు. వాటిని హనుమంతుడు గుర్తించగలిగాడు. అంతేగాక ఆమె పడవేసిన ఆభరణాల స్థానంలో ఇప్పుడామెకు ఏ ఆభరణాలూ లేవు. గుర్తించటం ఎంత కష్టంగా ఉన్నా, ఈమె సీతే అయి ఉండాలని హనుమంతుడు నిశ్చయించుకున్నాడు. అతనికి అమితమైన ఆనందం కలిగింది. తాను రాక్షసస్త్రీల కంట పడకుండా ఉండటానికి గాను ఎత్తుగావుండి ఆకులతో గుబురుగా వున్న కొమ్మల చాటున దాగివుండి, సీతనూ, ఆమెను చుట్టుముట్టి ఉన్న రాక్షసస్త్రీలనూ శ్రద్ధగా గమనించాడు.

రాత్రి చాలావరకు గడిచి పోయింది. రాక్షసులు వేదాధ్యయనం ప్రారంభించటం హనుమంతుడికి వినిపించింది. అదే సమయంలో మంగళవాద్యాలు మోగాయి. రావణుడు మేలుకున్నాడు. మేలుకుంటూనే అతనికి సీత జ్ఞాపకం వచ్చింది. అతను వెంటనే అలంకరించుకుని అశోకవనానికి బయలుదేరి వచ్చాడు. అతని వెంట నూరుమంది దేవతాస్త్రీలూ, గంధర్వస్త్రీలూ వచ్చారు. కొందరు స్త్రీలు బంగారు దివిటీలు పట్టుకున్నారు. మరి కొందరు చామరాలూ, విసనకర్రలూ పట్టుకున్నారు. కొందరు స్త్రీలు కత్తులు పట్టుకుని అతని వెనుక నడిస్తే, మరి కొందరు బంగారు పాత్రలలో నీరు తీసుకుని అతను ముందు నడిచారు. ఒకతె రావణుడికి గొడుగు పట్టింది.



ఆడవాళ్ళు నడిచేటప్పుడు కలిగే నూపురధ్వని హనుమంతుణ్ణి అటుకేసి ఆకర్షించింది. దీపాల వెలుతురులో అతను రావణుణ్ణి చూశాడు. రావణుడు ఏం చేస్తాడో చూడాలన్న కోరికతో అతను తాను కూర్చుని ఉన్న చెట్టుకొమ్మ మీది నుంచి కింది కొమ్మకు దిగి, తాను ఇతరులకు కనబడకుండా ఆకు గుబురులచాటున మళ్ళీ దాగి, శ్రద్ధగా చూడసాగాడు.

రావణుడు తిన్నగా వచ్చి సీత సమీపంలో ఆగాడు.

సీత రావణుణ్ణి దూరానేచూసి వణికిపోయింది. ఆమె కాళ్ళు ముడుచుకుని, రొమ్ముకు చేతులు అడ్డం పెట్టుకుని ఏడుస్తూ కూర్చున్నది. ఆమె తనకెవరైనా అడ్డపడతారా అన్నట్టు నాలుగు దిక్కులా చూసింది.

మూర్తీభవించిన శోకదేవతలాగున్న సీతతో రావణుడు ఇలా అన్నాడు:

"సీతా, నన్నుచూసి భయపడి ఎందుకు అలా ముడుచుకు పోతావు? నీ అందం చూసి మోహించాను. నన్ను స్వీకరించు. నీకు ఇక్కడ నా భయంగాని, ఇతరుల భయంగాని ఏ మాత్రమూ లేదు. నీకు నా మీద ప్రేమకలగలేదు. అందుచేత నేను నిన్ను తాకను. దుఃఖించకు. మాసిన బట్టతో, ఉపవాసాలుంటూ, తల దువ్వుకోకుండా ఇలా ఉండటం నీకు తగదు. నన్ను స్వీకరించి, పూలమాలలు ధరించు, మంచి నగలు పెట్టుకో, మేలైన మద్యాలు తాగు, మంచి మంచాలమీద పడుకో, ఆటపాటలతో కాలం గడుపు. సుఖంగా ఉండు. నీ యవ్వనం వృధాకానీకు. నీ వంటి సుందరి సృష్టిలో లేదు. నేను పరపురుషుణ్ణి అనే భ్రమ వదులుకో. నిన్ను నా పట్టమహిషిగా చేస్తాను. నీ దాసుణ్ణిగా ఉంటాను. నీకు ఏం కావాలన్నా నన్ను ఆజ్ఞాపించు. అడవులపాలైన ఆ రాముడు నీ కెందుకు? అతనింకా బతికి ఉన్నాడన్న ఆశలు పెట్టుకోకు. అతను నిన్ను చూడటానికైనా యిక్కడికి రాలేదు.''





# కిన్నెరరాణి

పూర్వం కాశ్మీరదేశంలో ఒక పేదవాడు ఉండేవాడు. వాడు రోజూ అరణ్యంలోకి వెళ్ళి, అందమైన పిట్టలను పట్టి, వాటిని తెచ్చి అమ్ముకుని తన కుమారుడైన సుధాముణ్ణిపోషిస్తూ ఉండేవాడు. కొంతకాలానికి తండ్రి చనిపోగా సుధాముడు ఒంటరిగాడైపోయాడు. అంత చిన్న వయసులో తననుతానేపోషించుకోవలసినవాడైనాడు.

తండ్రిపోయిన మర్నాడే సుధాముడు పిట్టలబోను తీసుకొని అరణ్యానికి పోయి, బోనును చెట్టుకొమ్మలలో పెట్టి వేచి కూర్చున్నాడు. కొంతసేపటికి అందులో ఏదో పక్షిపడింది. సుధాముడు చెట్టెక్కి చూసేసరికి బోనులో పడినది కాకి అని తెలుసుకున్నాడు. ఆ కాకిని ఎవరు కొంటారు? ఈ పనికిమాలిన పక్షిని ఏం చెయ్యాలాఅనిసుధాముడుఆలోచిస్తుండగా బోనులో పడిన కాకి మానవకంఠంతో, "అయ్యా, నన్ను వొదిలిపెట్టినట్టయితే నీకు చాలా ఉపకారం చేస్తాను రేపటి రోజున నీ బోనులో అతిసుందరమైన పక్షి పడేటట్టు చేస్తాను. దానిని మహారాజు వద్దకు పట్టుకువెళ్తే నీకు అంతులేని ధనం లభ్యమవుతుంది," అన్నది.

కాకి మాటలు నమ్మి సుధాముడు దానిని బోను విడిపించాడు. ఆ కాకి చెప్పినట్టే మర్నాడు సుధాముడి బోనులో ఒక మనోహరమైన పక్షి పడింది. అంత అందమైన పక్షిని అతడు ఎన్నడూ చూడలేదు. వాడు దానిని తీసుకుపోయి మహారాజుకిచ్చేసరికి మహారాజు చాలా సంతోషించి సుధాముడికి అంతులేని బంగారం ఇచ్చాడు. అంత బంగారం ఏం చేసుకోవాలో వాడికి తెలియలేదు. అంత ధనం వచ్చినా సుధాముడి కష్టాలుమాత్రం తీరలేదు. ఎందుకంటే, కాశ్మీరమహారాజు

కాశ్మీర జానపద కథ



దగ్గిర విదూషకుడొక డుండేవాడు. ఒక్క పక్షికోసం మహారాజు సుధాముడికి అంత ధనం ఇవ్వటం చూసి విదూషకుడికి కడుపు మండింది. అందుచేత వాడు మహారాజుతో, "ప్రభూ! ఇంత అందమైన పక్షిని లోహపంజరంలో ఉంచటం భావ్యం కాదు. దీనికోసరం ఏనుగు దంతంతో చక్కని ఇల్లు నిర్మించండి," అన్నాడు.

"ఇల్లు నిర్మించేటంత ఏనుగు దంతం ఎక్కడ దొరుకుతుంది?" అన్నాడు మహారాజు.

"ఇంత గొప్ప పక్షిని తెచ్చినవాడు దాని ఇంటికి కావలసిన ఏనుగు దంతం తేలేడా? తెమ్మని ఆజ్ఞాపించండి," అన్నాడు విదూషకుడు.

మహారాజు సుధాముణ్ణి పిలిపించి, "నీవు తెచ్చిన పక్షికి ఒక దంతహర్మ్యం కట్టదలిచాం. దానికవసరమైన దంతాలు పట్టుకురా. నలభై రోజులు వ్యవధి ఇస్తున్నాను. లేకపోతే నీ తల తీసేస్తాను," అని కఠినంగా అజ్ఞాపించాడు.

సుధాముడు విచారంగా ఇంటికి వెళ్లాడు. అంత దంతం తెచ్చుకోవటం మహారాజుకు సాధ్యం కాకనే తనకీపని పెట్టాడనీ, తనకు చావు తప్పదనీ అతడికి తెలిసింది. ఇంతలో కాకి వచ్చి, "ఏం యజమానీ? ఎందుకంత విచారంగా ఉన్నావు?" అని అడిగింది.

తన కష్టాన్ని సుధాముడు కాకితో చెప్పాడు. "దీనికి ఇంత విచారపడాలా? రాజుగారిని నలభైపీపాల సారాయి ఇమ్మని అడుగు. ఇక్కడికి నూరు యోజనాల దూరంలో ఒక కొలనున్నది. ఆ కొలను వద్దకు రోజూ ఏనుగులు గుంపులుగా వచ్చి, నీరు తాగుతాయి. ఆ కొలనులో సారా కలిపావంటే నీపని పూర్తి అవుతుంది," అన్నది కాకి.

సుధాముడు మహారాజువద్దకు వెళ్ళి, "ప్రభూ, నావెంట బళ్లమీద నలభైపీపాలు సారాపంపితేతమరుకోరినదంతంయావత్తూ గడువులోగా పట్టుకొస్తాను," అన్నాడు.

మహారాజు సరేనని బళ్ళ మీద నలభై పీపాల నిండుగా సారా పంపించాడు. వెంటనే, కాకిచెప్పినప్రకారం సుధాముడు నూరు యోజనాలు ప్రయాణం చేసి ఏనుగుల కొలనువద్దకు చేరుకున్నాడు. కొలనులో సారా పోయించాడు.



ఆ రాత్రే కొలనువద్దకు పెద్ద ఏనుగుల దండు వచ్చింది. ఏనుగులన్నీ నీళ్ళలో కలిసి వున్న సారా తాగేసి మత్తుతో పడి పోయాయి. సుధాముడు రంపం తీసుకుని మగ ఏనుగుల దంతాలన్నీ కోసుకుని బళ్ళ మీది కెత్తించి తిరుగుప్రయాణం కట్టాడు.

దంతం చూసి మహారాజు సంతోషించాడు. సుధాముడికి మరికొంత బహుమానం ఇచ్చి పంపాడు. త్వరలోనే ఆ అందమైన పక్షికి దంతపు ఇల్లు తయారయింది.

విదూషకుడు మరింత మండిపడ్డాడు. వాడు మహారాజువద్దకు పోయి, "మహాప్రభూ! మన పక్షి దంతహర్మ్యంలో ఉన్నా దాని మనస్సుకు ఆనందం లేదు. అందుకే అది గొంతెత్తి పాడకుండా ఉంది," అన్నాడు.

"దానికి మనం ఏం చెయ్యాలి?" అని అడిగాడు మహారాజు.

"దాని పూర్వపు యజమానిని తెస్తేగాని, అది సంతోషంగా పాడదు. ఆ యజమానిని రప్పించండి," అన్నాడు విదూషకుడు.

"దాని యజమాని ఎవరో మనకెట్లు తెలుస్తుంది? మనం ఎట్లా తీసుకు రాగలం?" అన్నాడు మహారాజు.

"అంత దంతం తీసుకు రాగలిగిన వారు, ఆ పక్షి యజమానిని తీసుకు రాలేరా ఏమిటి?" అన్నాడు విదూషకుడు.

మహారాజు సుధాముణ్ణి తనవద్దకు మళ్ళీ పిలిపించాడు.

"ఈ పక్షి యజమానిని వెతికి నలభై రోజులలోగా తీసుకురా. లేకపోతే నీ తల ఎగిరిపోతుంది," అన్నాడు మహారాజు.

సుధాముడు, తన కష్టాలింకా పూర్తి కానందుకు ఎంతో విచారిస్తూ ఇంటికి వెళ్ళాడు.



సుధాముడి వద్దకు కాకి మళ్లా వచ్చి, "ఏం, యజమానీ? ఎందుకంత విచారంగా ఉన్నావు?" అన్నది.

తనకు వచ్చిన కష్టాన్ని కాకితో చెప్పుకున్నాడు సుధాముడు.

"దీనికింత విచారపడాలా? రాజుగారి నడిగి ఒక పడవ పుచ్చుకో. అందులో రాజభోగాలకు అనువైన సంబారాలన్నీ అమర్చుకో. ఆ పడవ ఎక్కి నదివెంబడి తూర్పుగా నూరు యోజనాలు వెళ్ళావంటే అక్కడ కిన్నెరలుండే ఒకస్థలం వస్తుంది. వాళ్ళు పడవ చూడవస్తారు. కాని కిన్నెరల రాణినితప్ప మరెవరినీ పడవ ఎక్కనివ్వకు. ఆమెను వెంట పెట్టుకుని వచ్చెయ్యి. ఆమె ఆ పక్షికి యజమాని," అని చెప్పింది కాకి.

కాకి చెప్పినట్టే సుధాముడు మహారాజు నడిగి ఒక పడవ తీసుకున్నాడు. అందులోనే స్నానాలకూ, పడకకూ, విహారానికీ, సమస్త వినోదాలకూ ఏర్పాట్లు చేయించాడు. అక్కడి నుంచి నదిలో తూర్పుగా ప్రయాణమై వెళ్ళాడు.

కొంతకాలం ప్రయాణం చేయగా, చేయగా కొండలమధ్య కిన్నెరలు వుండే ప్రదేశం వచ్చింది. ఎన్నడూ పడవ అంటే ఎరుగని కిన్నెరలు పడవ చుట్టూ మూగారు. కాని సుధాముడు వారిని లోనికి రానివ్వలేదు.

"ముందు మీ రాణీకి పడవ చూపిస్తాను. ఆతరువాత మిగిలినవారు చూద్దురుగాని," అని వాళ్ళతో చెప్పాడు సుధాముడు.

కిన్నెరలరాణి ఈమాట విని పరమానంద భరితురాలై పడవ ఎక్కింది. ఆ పడవలో ఒక్కొక్క గదీ, ప్రతిగదిలోనూ చేసిన అలంకారాలూ, దీపాలూ, తివాసీలూ, మెత్తలూ చూస్తూంటే ఆమెకు కాలం ఎట్లా గడుస్తున్నదీ కూడా తెలియలేదు. ఈలోగా పడవ తెరచాపలెత్తి, దానిని తిరుగుముఖంపట్టించారు. కిన్నెరలరాణి పడవ చూడటం పూర్తిఅయేసరికి పడవ అప్పుడే నాలుగైదు యోజనాలు దాటి వచ్చేసింది.

సుధాముడు కిన్నెరల రాణితో మహా రాజుగారి ప్రాంగణంలో అడుగుపెట్టాడో లేదో, అప్పుడే దంతహర్మ్యంలో ఉన్న పక్షి గొంతెత్తి అతిశ్రావ్యంగా పాడసాగింది. ఆ పాట విని మహారాజు పరవశుడయ్యాడు. కిన్నెరల రాణిని చూశాక మహారాజు పారవశ్యం మరింత అధికమయింది. ఆయన ఆమెను పెళ్ళాడ నిశ్చయించాడు. ఆమె సమ్మతించింది.

పెళ్ళి ప్రయత్నాలన్నీ ఆర్భాటంగా జరిగాయి. పెళ్ళికి గొప్పగొప్పవాళ్ళంతా వచ్చారు. సుధాముడికి కూడా ఆహ్వానం వెళ్ళింది. అసలు అతనే పెళ్ళిపెద్ద.

ఈ సమయంలో పెళ్ళి చూడడానికి సుధాముడి భుజం మీద ఎక్కి అతని స్నేహితురాలైన కాకి కూడా వచ్చింది. ఆ కాకిని చూడగానే కిన్నెరరాణి మండిపడి, ''ఓసి, పిశాచీ! ఇక్కడికీ వచ్చావుటే?'' అన్నది.

''ఈ కాకి నాకు ఆప్తస్నేహితురాలు. ఈమెవల్ల ఏదన్నా అపచారం జరిగి ఉంటే క్షమించండి!'' అని కిన్నెరరాణిని వేడుకుంటూ, సుధాముడు ఆ కాకివల్ల తనకు జరిగిన సహాయం వివరించాడు. ఆ కథ విన్నాక కిన్నెరరాణి శాంతపడింది.

''ఇది నా చెలికత్తె. చాలా పొగరుబోతుది. అందుకని దానిని కాకిగా మార్చేశాను. శిక్షించినా దానికి నామీద ఇంకా అభిమానం ఉన్నట్టే ఉంది. సరే, దీనికి శాపవిమోచనం చేస్తాను!'' అన్నది కిన్నెరరాణి.

మరుక్షణం సుధాముడి భుజం మీది కాకి రెక్కలు విదిలించి, కిన్నెరరూపంలో అతని పక్కనే నిలబడింది.

ఇదంతా చూసిన కాశ్మీరరాజు చాలా సంతోషించి తన పెళ్లి ముహూర్తానికే సుధాముడికీ, శాపవిముక్తి పొందిన కిన్నెరకూ వివాహంచేయించేశాడు. దుష్టబుద్ధిఅయిన విదూషకుణ్ణి కొరతవేయించాడు. సుధాముడు రాజుగారి కొలువులోనే వుండి తన కిన్నెరభార్యతో చిరకాలం సుఖంగా కాలం గడిపాడు.



# తెలివైనపులి!

శిల్పంగేరి గ్రామంలో సిద్దయ్యా అనే గొర్రెలకాపరి ఒకడుండేవాడు. వాడు రోజూ తన యజమాని గొర్రెలమందను అడవిప్రాంతానికి తోలుకుపోయి, చీకటిపడేవేళకు ఇంటికి తోలుకువస్తూండే వాడు. ఒకసారి వాడికి అవసరంగా కొంత డబ్బు కావలసి వచ్చింది. ఎక్కడా డబ్బు దొరక్క పోయేసరికి, వాడు గొర్రెల్లో ఒకదానిని అమ్మేశాడు.

సిద్దయ్యా మామూలు ప్రకారం గొర్రెలను ఇంటికి తోలుకురాగానే, వాడి యజమాని వాటిని లెక్కించి, "ఏరా, మందలో ఒక గొర్రె తగ్గిందేమిటి ?" అని అడిగాడు.

అందుకు సిద్దయ్యా, "అయ్యా, చెప్ప మరిచాను. ఒక తెలివైన పులి నాకు తెలియ కుండా ఒక గొర్రెను ఎత్తుకుపోయింది," అన్నాడు.

యజమాని వాడి మాట నిజమనుకుని, ఇకనైనా జాగ్రత్తగా వుండమని మందలించాడు. మర్నాడు సిద్దయ్యా మరొక గొర్రెను అమ్మి, యజమానితో పులి మరొక గొర్రెను చంపి ఎత్తుకు పోయిందని చెప్పాడు.

"అలాగా! అయితే రేపు వేటగాడు గురవయ్యాను వెంటబెట్టుని మంద దగ్గిరకు వస్తాను. వాడి బాణం గురికి తిరుగులేదు. పులి అంతు తేలుద్దాం," అన్నాడు యజమాని.

కాని ఆ మర్నాడు సాయంత్రం అయినా పులి రాలేదు. యజమాని, సిద్దయ్యాతో, "పులి రాలేదే! ఏమైనట్టు?" అన్నాడు.

"అయ్యా, నేను మొన్ననే చెప్పాగదా! ఆ పులి చాలా తెలివైనది. గురవయ్యాంతటి ఆరితేరిన వేటగాడు, మంద దగ్గిరకు వచ్చాడని తెలుసుకుని వుంటుంది. గురవయ్యా ఇక్కడికి వచ్చినన్నాళ్ళూ, పులి ఈ చాయలకు రాదు," అన్నాడు సిద్దయ్యా తెలివిగా.

ఆ జవాబుకు యజమాని చిన్నగా నవ్వి, "నువ్వు చెప్పిందే నిజమైతే, గొర్రెలమంద కాపలాకు గురవయ్యే తగినవాడు! రేపటి నుంచీ నువ్వు పనికి రానవసరం లేదు," అన్నాడు.

ఆ వెంటనే సిద్దయ్యా, యజమాని కాళ్ళ మీద పడి, నిజం చెప్పేశాడు. యజమాని వాణ్ణి క్షమించి, "సరే, ఈనాటి నుంచయినా దొంగబుద్ధి మాని, నిజాయితీగా మసులుకోవడం అల వరుచుకో," అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

—కోలార్ కృష్ణ అయ్యర్






ఒక గ్రామంలో ఒక రైతుండేవాడు. అతనికి చిన్నతనంలోనే భార్య పోయింది. గ్రామంలో వెంకి అనే దిక్కులేని పిల్ల ఒకతె ఉండేది. రైతు దానిచేత ఇంటిపని అంతా చేయించుకునేవాడు. తీరికగా ఉన్నప్పుడు అది మిగతా కూలీలతో కలిసి సంతోషంగా పొలంపనులు కూడా చేసేది. పని చెయ్యటంలో వెంకికి అలుపూ, సలుపూ అంటూ లేదు. కాని దానికి వేప కాయంత వెర్రి ఉండేది.

''ఇంటి పనంతా నేనే చేస్తుంటినిగదా, నన్ను పెళ్ళి చేసుకోరాదా ఏం?'' అనేది వెంకి తన యజమానితో.

''చేసుకోక చేసుకోక నిన్నే చేసుకోమన్నావుటే?'' అనేవాడు రైతు.

కాని వెంకి అస్తమానమూ ఇదే పాట సాగించింది. ''నన్నెందుకు చేసుకోవు? నాకేం వొంకొచ్చింది? నేనుండగా ఇంకొకతెను ఈ ఇంట్లో అడుగు పెట్టనిస్తానా?'' అంటూ అది తన యజమానిని కాల్చుకు తిన్నది. దాని బాధ భరించలేక రైతు, ఒక నాటి మధ్యాహ్నం, వెంకి పొలం పని చేసి అలిసి చేనులోనే పడుకుని ఒళ్ళు తెలియకుండా నిద్రపోతుంటే, దాని ఒంటి నిండా నూనె కలిపిన కాటుక పట్టించేశాడు.

పొద్దువాలే సమయానికి వెంకి నిద్ర లేచి, తన కాళ్ళూ చేతులూ చూసుకుని తానే భయపడింది. ''నేను నేనా లేక దయ్యమా?'' అని దానికి అనుమానం వచ్చింది. అది తిన్నగా తన యజమాని ఇంటికి వెళ్ళి, ''వెంకి ఇంట్లో ఉందా, బాబూ?'' అని అడిగింది.

''ఆ, ఇంట్లోనే ఉంది,'' అన్నాడు రైతు, ఇక తనకు దాని పీడ వదిలిందనుకుని.

''అయితే, నేను వెంకిని కానన్న మాటేగా?'' అనుకుంటూ వెంకి మసక



చీకట్లోపడి, తిన్నగా అడివి కేసి బయలు దేరింది.

అడవిలో దానికి ఇద్దరు దొంగలు కనిపించారు. వాళ్ళు దాన్ని చూసి భయపడి పారిపోసాగారు.

''ఎందుకురా, వెర్రి నాగన్నల్లారా, నన్ను చూసి అలా బెదిరి పారిపోతారు? దొంగతనానికి పోతుంటే నన్ను వెంట బెట్టుకు పొండి, సహాయంగా ఉంటాను,'' అని వెంకి కేక పెట్టింది.

పిశాచి తమ వెంట ఉండటం కూడా ఒక విధంగా మంచిదే ననుకుని, దొంగలు భయపడటం మాని, వెంకి దగ్గిరికి వచ్చారు. వాళ్ళు ఆ రోజు ఎక్కడన్నా ఒక మంచి గొర్రెను దొంగిలించాలని ఉన్నారు. కాని ఎక్కడ గొర్రె దొరుకుతుందో వాళ్ళకు తెలీదు.

''అదంతా నాకు వదిలి పెట్టండి. కటిక చీకట్లో కూడా గొర్రెల కొట్టానికి పోగలను,'' అన్నది వెంకి. దొంగలు సంతోషించి వెంకి వెంట వచ్చారు. దొంగలను బయట ఉండమని వెంకి కొట్టం ప్రవేశించింది. దొంగలు గొర్రె కోసం ఎదురు చూస్తూండగా వెంకి, ''పోతు కావాలా? పెంటి కావాలా?'' అని గావు కేక పెట్టింది.

''అరవకు! బలిసినదిగా చూసి ఏదో ఒకటి పట్రా!'' అన్నారు దొంగలు.

''బలిసినదే! పోతు కావాలా? పెంటి కావాలా?'' అని వెంకి మరింత గట్టిగా అరిచింది.

''అరుస్తావెందుకు? బలిసినదైతే పోతయినా సరే, పెంటి అయినా సరే!'' అన్నారు దొంగలు.

''ఇక్కడ బోలెడన్ని గొర్రెలు. పోతు కావాలా? పెంటి కావాలా? ఏది కావాలంటే అదే ఉన్నది,'' అని వెంకి మరింత గట్టిగా అరిచింది.

''నోరు మూసుకుని ఏదో ఒకటి పట్టుకురా!'' అన్నారు దొంగలు.

ఈలోపుగా గొర్రెల యజమాని వెంకి పెట్టిన గావు కేకలకు లేచి బయటికి

వచ్చాడు. అతణ్ణి చూడగానే దొంగలు కాలికి బుద్ధి చెప్పారు.

"ఉండండర్రా! ఆగండర్రా!" అంటూ వెంకి గొర్రెల మధ్యనుంచి పరిగెత్తుకుంటూ వచ్చింది. వెంకిని చూడగానే గొర్రెల యజమాని భయంతో కొయ్యబారి పోయి, తన మందలోకి పిశాచి వచ్చిందనుకున్నాడు.

ఆ రోజు దొంగలకూ, వెంకికీ తిండిలేదు. మర్నాడు చీకటిపడగానే వాళ్ళు ఒక కోడిని తస్కరించటానికి బయలుదేరారు. కాని కోడి ఎక్కడ దొరికేదీ వాళ్ళకు తెలీదు.



"అదంతా నాకు వదలండి. నాకు ఊళ్ళో ఉండే కోళ్ళగూళ్ళన్నీ బాగా తెలుసు," అని వెంకి వాళ్ళను వెంట బెట్టుకుని ఊళ్ళోకి వచ్చింది. అది దొంగలను బయట ఉండమని కోళ్ళ ఆవరణలో ప్రవేశించి, "పెట్ట కావాలా? పుంజు కావాలా? ఇక్కడ బోలెడన్ని కోళ్ళు," అని గావు కేక పెట్టింది.

"అయితే పొలికేకలు దేనికి? బరువుగా వున్న కోడిని చూసి పట్టుకురా!" అన్నారు దొంగలు.

"అదే, పెట్ట కావాలా? పుంజు కావాలా?" అని వెంకి మళ్ళీ గావు కేక పెట్టింది.

"కేకలు పెట్టక, వాటమైన కోడి నొకదాన్ని తీసుకురా," అన్నారు దొంగలు.

"అట్లా కాదు, పుంజు కావాలా? పెట్ట కావాలా? ఇక్కడ బోలెడన్ని కోళ్ళు!" అన్నది వెంకి. ఈ కేకలకు కోళ్ళన్నీ లేచి అరవసాగాయి. కాపలావాడు లేచాడు. దొంగలు పరుగు లంకించుకున్నారు.

"ఆగండర్రా, బుద్ధితక్కువ వాళ్ళల్లారా! పుంజు కావాలంటే పుంజో, పెట్ట కావాలంటే పెట్టో ఇచ్చేదాన్నిగద! ఏదీ చెప్పక పోతిరే!" అంటూ వెంకి వాళ్ళ వెనకే పరిగెత్తింది.

వెంకిని చూస్తూనే కోళ్ళ కాపలావాడు భయంతో విరుచుకు పడిపోయాడు.

రెండు రోజులుగా దొంగలు కనబడ లేదు. ఊళ్ళోనేమో పిశాచం తిరుగు

తూన్నవార్త వ్యాపించి అందరూ హడలిపోయారు. మూడో రోజు నిశిరాత్రి దొంగలు ఒక గొర్రె దొరుకుతుందేమో చూడటానికి బయలుదేరారు. 'వెంకి వెంట వస్తానంటే వాళ్ళు వద్దనేశారు. ఆ పిశాచాన్ని వెంట బెట్టుకుపోతే తమకు ఆకలిచావు తప్పదని దొంగలకు తోచిపోయింది.

వెంకికి కూడా ఆకలి దహించుకుపోతున్నది. అందుచేత అది ఊరి బయట ఉన్న ఒక పొలానికి వెళ్ళి, అక్కడ చిలగడ దుంపలు పీకి అవురావురని తిన సాగింది. పొలంలోనే గుడిసె వేసుకుని ఉన్న పొలందారు ఒక రాత్రివేళ బయటికి వచ్చి, చిలగడదుంపలు పీక్కు తింటున్న వెంకిని చూసి, దయ్యమనుకుని, అప్పటి కప్పుడే భూతవైద్యుడి ఇంటికి పరిగెత్తాడు.

భూతవైద్యుడు నిద్రలేచి పై పంచె వేసుకుని పొలందారు వెంట బయలుదేరాడు. పొలంలోకి రావాలంటే దారిలో రొంపి అడ్డున్నది. భూతవైద్యుడు రొంపిలో దిగి నడవనన్నాడు.

''నేను నిన్ను ఎత్తుకుని రొంపి దాటిస్తా. ఈ దయ్యాన్ని నువ్వు వదలగొట్టకపోతే ఇక నేను ముష్టెత్తుకోవాలిసిందే!'' అంటూ పొలందారు భూతవైద్యుణ్ణి వీపున ఎత్తుకుని రొంపిలోకి దిగి నడవసాగాడు.

పొలంలోనుంచి వెంకి వాళ్ళను చూసి దొంగలనుకున్నది. వాళ్ళు గొర్రెను సంపాదించుకొస్తున్నారనుకుని, ''బాగా కొవ్విన దేనా ?'' అని గట్టిగా అరిచింది.

పొలందారు రక్తం గడ్డకట్టుకుపోయింది. ''కొవ్విందో కాదో నువ్వే చూసుకో, మా తల్లీ!'' అంటూ వాడు భూతవైద్యుణ్ణి రొంపిలోకి తోసేసి, కాలి సత్తువ కొద్దీ పారిపోయాడు.

ఆ రాత్రి జరిగిన సమాచారం కూడా రైతుకు తెలిసింది. అతనికి వెంకిని చూసి జాలి వేసింది. అందుచేత అతను దాని కోసం అంతటా వెతికి, పట్టుకుని, చక్కగా స్నానం చేయించి, పురోహితుణ్ణి పిలిపించి, తానే పెళ్ళి చేసేసుకుని, సుఖంగా ఉన్నాడు.



# అగ్నిపర్వతాలు!

ఏజీ సముద్రంలోని థిరా అగ్ని పర్వతాల ద్వీపం క్రీ. పూ. 1470 వ సం॥లో అతి భయానకంగా బద్దలై దాదాపు 70 ఘనపు కి. మీ. పదార్థాన్ని వెలికి చిమ్మింది. అగ్ని పర్వతాల ప్రేలుడులో అతి భయానకమైన దయిన దీనిశక్తి — 40,00,000 హైడ్రోజన్ బాంబులకు సమానం!

ప్రపంచం మొత్తంమీద 455 సజీవ అగ్ని పర్వతాలు ఉన్నాయి. వీటిలో 167 ఇండోనేషియాలోనే ఉన్నాయి!

హవాయ్‌లోని మౌనాలోవా యే ప్రపంచంలోకెల్లా అతి పెద్దదైన అగ్ని పర్వతం. అడుగునుంచి శిఖరంవరకు దాని ఎత్తు దాదాపు 10 కి. మీ. (6 మైళ్లు). అడుగుభాగం అడ్డుకొలత దాదాపు 200 కి. మీ. (124.28 మైళ్లు).



ఆగ్నేయ ఐస్‌లాండ్‌లో 1783 వ సం॥ అగ్ని పర్వతం పేలి సుదీర్ఘమైన లావాప్రవాహాన్ని వెలికి చిమ్మింది. అప్పుడు బయటపడిన లావా ప్రవాహం దాదాపు 65.70 (43.5 మైళ్లు) కి. మీ. దూరం పారింది!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



Suraj N Sharma



B. Sreesailam

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మే నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ప్రియమైన నేస్తం! రెండవ ఫోటో: పాలైనా తాగవే!

పంపినవారు: బి. రాములు, సంజీవనగర్ వీధి, సంగారెడ్డి పోస్టు, మెదక్ జిల్లా—502 001 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

GO BONKERS!

WITH KWALITY ICE CREAM



CORNETTO BUTTERSCOTCH

CORNETTO MANGO

CORNETTO STRAWBERRY

Kwality

ICE CREAM



ఏబిసి ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్

తాడిగడప – 521 137. విజయవాడ. ఫోన్లు: 58351 & 58352

C – 42, ఇండస్ట్రియల్ ఎస్టేట్, సనత్ నగర్, హైదరాబాదు – 500 018. ఫోన్లు: 263287 & 261733.

LAA